ర్జనీభ్యాంవిన్యస్య, ఏవంతర్జన్యాదికనిష్ఠాంతం ॥ ఓం హెంతత్పుర్షవ
క్త్రాయనమః, ఓమ్ హూం అఘోరహృదయాయనమః, ఓంహీం
వామదేవ గుహ్యాయనమః, ఓమ్ హామ్ సద్యోజాత పాదాభ్యాం
నమః, ఇతి విన్యస్య, ఓమ్ హాామ్ విద్యాదేహాయనమః, ఇత్యం
గుష్ఠ తర్జనీభ్యాం కరతలయోః ష్టత్రింశతత్త్వామయం సదాశి
వాత్మకంస్థూలం విద్యాదేహం విన్యస్య, ఓమ్ హాం నేత్రేభ్యో
నమః, ఇతి నేత్రత్రయమ్, కరతలయో మధ్యమానామికాభిర్వి
న్యస్య, ఓమ్ హామ్ శివాయనమః, ఇత్యంగుష్ఠా నామికాభ్యాం
సదాశివ దేహవ్యాపకం శివమావాహయేత్, కనిష్ఠాదిషు, ఓమ్,
హామ్ హృదయాయనమః, ఇత్యాది నేత్రమంత్రవ్యతిరిక్తాన్ పం
చమంత్రాన్క్రమేణ విన్యస్య, వామదక్షిణ భుజయోస్తదితర క
రాభ్యాం ఓమ్ హైమ్ కవచాయ నమ ఇత్యవకుంఠ్య, కరద్వయం
సంయోజ్య, వౌషడంతమూలేన పరమీకృత్య, అన్యస్థానాం హృ
దయ శిరశ్శిఖాదీనాం కలానాంచ భిన్న భిన్న వర్ణానా మావా
హిత పరశివ తేజసాతి ధవళేనతద్వర్ణతాపరమీకరణం॥ తతోం
గన్యాసం కుర్యాత్, దక్షిణాంగుష్ఠానామికాభ్యాం, ఓమ్ హామ్శి
వాసనాయ నమఇతి, కంఠమధ్యే, హృదివా, మూలాధారా త్స
ముద్భూతం శ్వేతం స్వస్యాసన పంకజం విన్యస్య, ఓమ్ హామ్
హామ్ హామ్ శివమూర్తయేనమఇతి నాభికందాదివా హృదయా
దివా భ్రూమధ్యపర్యంతం తేజోమయీం శివస్యసూక్ష్మమూర్తిం
విన్యస్య, ముష్టిం బధ్వాంగుష్ఠేన ఈశానమంత్రం మూర్ధ్ని విన్య
స్య, అంగుష్ఠయుక్తతర్జన్యాద్యాన్గుళిభి వక్త్రేషు, హృదిగుహ్యే, పాదయోశ్చ
తత్పురుషాఘోరవామదేవసద్యోజాత మంత్రాన్క్రమేణ విన్యస్య,
తస్మిన్నంగుష్ఠానామికాభ్యాం, ఓమ్ హామ్ హామ్, శివాయ నమఇ
తి పరమశివమావాహయేత్, తతో హృదయ శిర శ్శిఖాస్థానేషు

సాంగుష్ఠకనిష్ఠికానామికామధ్యమాభి ర్విన్యస్య, కంఠప్రావరణ
త్వేన స్తనమధ్యాంతం కవచం తర్జనీభ్యాం విన్యస్య, హస్తతల
యోరస్త్ర మనామికాభ్యాం విన్యసేత్, సర్వేష్వేతే మంత్రాశ్చన
మోంతాః అస్త్ర మంత్రస్తు ఫడంతః తతోహుం ఫడంతాస్త్రే
ణ తాలత్రయపురస్సరం దిగ్బంధనం కృత్వా, కవచేనావేష్ట్య
షడంతమూలేనమహాముద్రాంప్రదర్శయేత్, మస్తకాదిపాదాం
తం హస్తాభ్యాంసంస్పర్శనమ్, పాదాదిమస్తకాంతం మహాముద్ర
యాసంస్పర్శనం కుర్యాత్తతశ్శివసమానరూపమాత్మానం చింత
యేదితి సకళీకరణమ్॥ ... ... *

పాదాంగుష్ఠద్వయాదారభ్య యావన్మూలాధారం ద్విధాభూ
తం తదూర్ధ్వమాబ్రహ్మబిలాంత మేకీభూతాం హృత్కంఠాదిడా
పింగళాభ్యాంసంయుక్తామధోముఖపద్మముకుళైర్యుక్తాం శరీరాం
తరాళేతి సూక్ష్మాంవిద్యుల్లేఖామివ భాస్వరా మంత స్సుషిరయు
క్తాంసుషుమ్నానాడీంసంచింత్య, తస్యైవాంతర్బహిస్స్రవదమృత
ధారాం పరవ్యోమరూపిణీం శక్తింసంచింత్య- తన్మధ్యేహ్రామితి
శిఖాబీజం జ్వలంతం సంచింత్య, హృత్కంఠతాలుభ్రూమధ్యబ్రహ్మ
రంధ్రేష్వధోముఖతయాస్థితాని పద్మముకుళాని పూరకకుంభకరేచ
కైర్వికసితోత్తంభితోర్ధ్వముఖీకృతాని భావయిత్వా, మూలాధా
రప్రదేశే దీపశిఖావజ్జ్వలంతం హుంకారం హుం ఫడితి సంతతో
చ్చారేణ ఊర్ధ్వముద్గచ్ఛంతం ధ్యాయన్ తేన పంచబ్రహ్మాగ్రి స్థి
తాన్ పద్మనాళగ్రంధీన్ భిన్నాంశ్చ భావయిత్వా, హుం కారం
ప్రతినివృత్త్యా, దక్షిణనాడ్యావాయుం విరేచయేత్, పునరపిహుం
కారంమూలాధారేధ్యాయన్ పూరకవాయునోపసంహృత సర్వ
శరీర వ్యాపక చైతన్యం హృత్పంకజాశ్రిత పుర్యష్టక రూపసూక్ష్మ
దేహాన్వితం జీవం పుర్యష్టకాదాదాయ, స్ఫురత్తారకాకారమతి

సూక్ష్మమేకాకినం హామితిహృదయబీజసంపుటితంకృత్వా, హుం
కారంమూర్ధ్నివిన్యస్య, కుంభకంకృత్వా, వాయుమూర్ధ్వంప్ర
వర్తయేత్, సప్తారముద్రయాత్మమాదాయ, తదుపరిస్థితేపరశివే
యోజయేత్, ఇతిబీజకృత్యాశివేతనం, సూక్ష్మదేహశుద్ధయే,
ప్రతిలోమ్యేన, స్వేషుస్వేషుకారణేషు, తత్త్వానిబిందుపర్యంతం
లయంనయేత్, తద్యథా ॥ గంధేపృథ్వీం, రసేజలం, రూపేఅ
గ్నిం, స్పర్శేవాయుం, శబ్దేవ్యోమ, ఏతానితన్మాత్రాణ్యతామసా
హంకారే, వాక్పాణిపాదపాయూపస్థాఖ్యానిరాజసాహంకారే,
శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణాఖ్యానిమనశ్చసాత్వికాహంకారే,తం
చబుద్ధౌ, తాంగుణేషు, గుణతత్త్వంప్రకృతౌ, తాంరాగవిద్యా
యాం, కలాయాంపుంస్తత్త్వం, కాలంనియతికలాంచమాయాయాం
విలీనానివిభావ్య, శుద్ధవిద్యాతత్త్వమీశ్వరతత్త్వే, తచ్ఛక్తితత్త్వేతచ్ఛి
వతత్త్వే, తదపిశుభ్రరూపేబిందుంవిలీనంభావయేత్॥ యద్వా,ప్రా
సాదోచ్చారణేన హృదయాదిపద్మేషుశబ్దాదిత్యాగాత్, శబ్దస్ప
ర్శౌత్యజేద్బ్రహ్మా, రసంవైకేశవేత్యజేత్, రూపగంధౌత్యజే
ద్రుద్రోహంకారంబుద్ధిమీశ్వరే, మనోబిందుంశివేత్యక్త్వాపుర్యష్టక
విశుద్ధయే । తతస్థూలదేహంవిశోధయేత్ ॥ భూతశుద్ధిః ॥ అస్య
శ్రీభూతశుద్ధిమహామంత్రస్య, బ్రహ్మేంద్రేశ్వరాబుషయః, అమృ
తవిరాట్ఛందః, జీవాత్మాదేవతా, దేహశుద్ధ్యర్థేవినియోగః, పా
దాదారభ్యజానుపర్యంతం చతురశ్రరూపం పీతవర్ణంకఠినస్వభా
వంవజ్రలాంఛితం ప్లామితిహృదయబీజేన పార్థివబీజసహితేన
యుక్తంబ్రహ్మణాకారణేశ్వరేణాధిష్ఠితంనివృత్తికలారూపంపార్థి
వమండలంభావయామీతి, విచింత్య, ప్లాంనివృత్తికలాయైహుంఫ
డితిమంత్రేణపంచభిరుద్ఘాతైః పృథివ్యాంగంధరసరూపస్పర్శశబ్ద
గుణాంశ్చతారయేత్,తతోజాన్వాదినాభిపర్యంతమర్ధచంద్రాకారం

శ్వేతవర్ణం ద్రవస్వభావం పద్మలాంఛితం హ్వామితి శిరోబీజేన ఆ
ప్యబీజసహితేన యుక్తం విష్ణునా కారణేశ్వరేణాధిష్ఠితం ప్రతిష్ఠా
కలారూపమాప్యమండలం, భావయామీతి విచింత్య, హ్వాం ప్రతి
ష్ఠాకలాయై మహుం ఫడితి మంత్రేణ చతుర్భిరుద్ఘాతైరపాం, రసరూ
పస్పర్శశబ్దగుణానుత్సారయేత్, తతో నాభ్యాదికంఠపర్యంతం త్ర్య
శ్రం రక్తవర్ణం పచనస్వభావం స్వస్తికలాంఛితం హ్రూమితి శిఖామం
త్రేణాగ్నిబీజసహితేన యుక్తం రుద్రేణ కారణేశ్వరేణాధిష్ఠితం వి
ద్యాకలారూపమగ్నిమండలం భావయామీతి విచింత్య, హ్రూం వి
ద్యాకలాయై మహుం ఫడితి మంత్రేణ త్రిభిరుద్ఘాతైరగ్నిగతాన్రూపస్ప
ర్శశబ్దగుణానుత్సారయేత్, తతః కంఠాదిభ్రూమధ్యపర్యంతం ష
డశ్రం కృష్ణవర్ణం చలనస్వభావం షడ్బిందుభిర్లాంఛితం హ్యామితి కవ
చమంత్రేణ వాయుబీజసహితేన యుక్తం మహేశ్వరేణ కారణేశ్వరే
ణాధిష్ఠితం శాంతికలారూపం వాయుమండలం భావయామీతి విచిం
త్య హ్యాం శాంతికలాయై మహుం ఫడితి ద్వాభ్యాముద్ఘాతాభ్యాం వా
యోస్స్పర్శశబ్దగుణానుత్సారయేత్, తతో భ్రూమధ్యాది ద్వాదశాం
తపర్యంతం వృత్తాకారం ధూమ్రవర్ణమాకాశస్వరూపం బిందుశ
క్తిలాంఛితం హామిత్యస్త్రమంత్రేణ సంయుక్తం సదాశివేన కారణే
శ్వరేణ యుక్తమాకాశమండలం భావయామీతి విచింత్య, హాం శాం
త్యతీతకలాయై మహుం ఫడితి మంత్రేణ ఏకోద్ఘాతేన ఆకాశే శబ్దగుణము
త్సారయేత్, ఏతాని పృథివ్యాది మండలాని హృత్కంఠతాలుభ్రూ
మధ్యబ్రహ్మరంధ్రగతాని వా విభావ్య శోధయేదితి ప్రత్యేకశోధనవి
ధిః, పృథివీశోధనే తద్గుణపంచకోత్సారణానంతరం పృథ్వీం స్వవి
రుద్ధవాయ్వభిభూతాం వాయ్వాకారాపన్నాం వాయుశోధనసమ
యే వాయుం స్వవిరుద్ధపృథివ్యభిభూతం పృథివ్యాకారాపన్నం చ
భావయేత్, ఏవం జలానలావపి తత్తద్గుణోత్సారణానంతరం స్వవి

రుద్ధానిలజలాభిభూతానల జలాకారాపన్నంభావయేత్, ఆకా
శగుణోత్సారణానంతరమాకాశం నిత్యత్వవ్యాపకత్వశుద్ధత్వాదిత
ద్విరుద్ధగుణయుక్త పరశక్త్యాత్మకపరమాకాశాభి భూతంతదాకా
రాపన్నంశుద్ధస్ఫటికనిర్మలంభావయేత్ ॥ తతః ॥ స్థూలశరీరంపృ
థివ్యాదిపంచభూతబీజం మాయాక్షేత్రవినిక్షిప్త ధర్మాధర్మమూలం
ఇంద్రియశాఖోపశాఖంశబ్దాది విషయపల్లవంప్రపం చకుసుమంసు
ఖదుఃఖఫలం పురుషవిహంగోపభోగ్యం, ఊర్ధ్వమూలమధశ్శా
ఖంవటవృక్షవద్విభావ్య, ప్రాణాయామంకుర్వన్ షణ్మాత్రేణపూర
కార్ధేనహ్రీమిత్యుచ్చార పంచకయుక్తేన పత్రపుష్ప ఫలరహితం తీ
వ్రంవిచింత్య । పూరకాపరార్ధేన హ్వీ మిత్యుచ్చార చతుష్టయ
యుక్తేన శీఘ్రం పత్రపుష్ప ఫలోపేతం విభావ్య, ఏకస్మిన్నేవోద్ఘా
తేన ద్వాదశమాత్రేణకుంభకేనహ్రూమిత్యుచ్చారత్రయ యుక్తేన
సవ్యపాదాంగుష్ఠేన కాలాగ్నినాశుష్కం దగ్ధంచ విభావ్య, రేచక
పూర్వార్ధేన హ్రైమిత్యుచ్చారద్వితయేన భస్మీభూయ, దిక్షు
విప్రకీర్ణం విభావ్య, రేచకాపరార్ధేన హ్రౌ మిత్యేకోచ్చార
యుక్తేన స్ఫటికనిర్మలం శుద్ధవ్యోమరూపం చింతయిత్వా,అమృ
తేనప్లావయేత్, హాంశాంత్యతీత కలాయై నమఇత్యాదిభి మంం
త్రై స్సూక్ష్మపంచకలామయస్య సూక్ష్మశరీరస్య సృష్టిశాంతికలా
మంత్రైరివస్థూలపంచకలామయస్యస్థూలదేహస్య సృష్టించతత్త
ధ్వంసన పక్షేవిభావ్య, హ్లాంశక్తయే వౌషడితి మండల సృతామృ
తధారయాప్లావయేత్, తతోహృత్కమల కర్ణికాయాం అధా
రశక్తయేనమః, హామ్ జ్ఞానాయ, హామ్ వైరాగ్యాయ, హాంఐ
శ్వర్యాయ, హాంపద్మాయ, ఇతి మధ్యాగ్నేయాది కోణ చతుష్ట
యమధ్యేషు షడ్విధమాసనం విన్యస్య, తత్రసూక్ష్మదేహాత్మక మ
విభక్త కరచరణాదిరూపాం మూర్తిం హాం ఆత్మమూర్తయే న

మః ఇతి విన్యస్య, సహాం విద్యాదేహాయ నమః, ఇతి అష్టత్రింశత్కలామయం సదాశివరూపం ధ్యాత్వా, హాం శివాయనమః, ఇతి ద్వాదశాంతం పరమశివసాయుజ్యం నిర్మలజ్ఞానక్రియాశక్తికం యజన మూర్తిరూపం జీవాత్మానం తత్రానాహ్య, హృదయాదిస్థానేషు హృదయాదిమంత్రాన్విన్యస్య, మూలేన పరమీకృత్య, వౌషడంతశక్తిమంత్రేణ ద్వాదశాంతస్థితశక్తిమండలస్రుతబహుళామృతధారయాభిషించేత్॥ యద్వా॥ ఏవం జీవశుద్ధికరణాశక్తౌ న్యాస మాత్రంకుర్యాత్ ॥ ఆత్మ విద్యాశివైస్తత్త్వైశ్శోధయేద్దేహపాదపమ్ । ఓం హాం ఆత్మతత్త్వాయ హుంఫడితి పాదయోః, ఓం హీం విద్యాతత్త్వాయ హుంఫడితి హృదయే, ఓం హూం శివతత్త్వాయ హుంఫట్ శిరసి, ఇతి తత్త్వత్రయ సంశోధ్య, పంచభూతాని స్వశరీరే పూర్ణవటవృక్షవత్సంభావ్య, ఆత్మానం సహ్మారముద్రయా ద్వాదశాంతే నియోజ్య అస్య శరీరస్య ఛేదనశోషణ దాహనప్లావనపిండీకరణస్థాపనం కరిష్యే ॥ పంచవక్త్రం మహాఘోరం దశబాహుం త్రిలోచనమ్। వికృతం భాసురం చోగ్రం పింగభ్రూశ్మశ్రు మూర్ధజమ్ । ఖడ్గఖేటకనారాచ ధనుస్సూత్ర కమండలూన్। శక్తిం శూలంచ పరశుం వహంతం బ్రహ్మదండకమ్ ॥ ఏకపాదం ద్విపాదంచ సమపాదచతుష్టయమ్ । సర్వాంగ భుజగోపేతం నాగయజ్ఞోపవీతినమ్ ॥ ఏవం ధ్యాత్వాయజేదస్త్రం ప్రణతార్తివినాశనమ్ ॥ ఓం శ్లీం పశుం హుంఫట్, పంచ చతుస్త్రిద్వ్యేక పాశచ్ఛేదనం విభావ్య, ఓం హ్యైమితి వాయుబీజేన దేహపాదపం శోష్య, పాదాంగుష్ఠాది శిఖాంతం ఓం హ్రూమిత్యగ్నిబీజేన సందహ్య, శరీరం దగ్ధరజ్జువత్సంభావ్య-ఓం హ్వ్యాం ఇత్యమృతబీజేన సంప్లావ్య, ఓం ప్లాం ఇత్యచలాబీజేన తద్భస్మపిండీకరణం విభావ్య, ఓం హం ఇత్యాకాశబీజేన జీవాత్మపరమాత్మనోరైక్యం సంచింత్య ఓం హాం హ్వైం హ్రూం హ్వ్యాం ప్లాం

ఇత్యాకాశాది పృథివ్యంతే ముత్పాద్య, ఆత్మానం సుఖమితి సంభా వ్య, స్వ శరీరే శివతనుంసంచింత్య, శివమయమాత్మానం పంచక లేనప్రణవేన పూరకేణసృష్ట్యాసమానీయ, ద్వాదశాంతస్థమాత్మా నంజ్యోతీరూపంహృత్కమలేసంస్థాప్య,ప్రాణప్రతిష్ఠాం కుర్యాత్॥

## —(*) అథ ప్రాణప్రతిష్ఠావిధిః (*)—

అస్యశ్రీప్రాణప్రతిష్ఠామహామంత్రస్య, బ్రహ్మవిష్ణుమహేశ్వరా ఋషయః, ఋగ్యజుస్సామాథర్వాణశ్ఛందాంసి, సకలసృష్టిస్థితిస మ్హారకారిణీప్రాణశక్తిఃపరాదేవతా, ఆంబీజంహ్రీంశక్తిఃక్రోంకీ లకమ్, మమప్రాణప్రతిష్ఠా సిద్ధ్యర్థేజపేవినియోగః, ఆంఅంకం ఖంగంఘంఙంఆం పృథివ్యాప్తేజోవాయ్వా కాశాత్మనేఅంగుష్ఠా భ్యాంనమః, హ్రీంఇంచంఛంజంఝంఞంఈం శబ్దస్పర్శరూపరసగ ంధాత్మనేతర్జనీభ్యాంనమః, క్రోంఉంటంఠండంఢంణంఊంశ్రోత్రత్వ క్చక్షుర్జిహ్వాఘ్రాణాత్మనేమధ్యమాభ్యాంనమః, ఆంఏంతంథందంధం నంఐం వాక్పాణిపాదపాయూపస్థాత్మనే అనామికాభ్యాంనమః, హ్రీంఓంపంఫంబంభంమంఔం మనోబుద్ధిచిత్తాహంకారాత్మనేకని ష్ఠికాభ్యాంనమః, క్రోంఅం యంరంలంవంశంషంసంహంళంక్షంఅః వచనాదానగమనవిసర్గానందాత్మనేకరతలకరపృష్ఠాభ్యాంనమః, ఏవంహృదయాదిన్యాసః భూర్భువస్సువరోమితిదిగ్బంధః॥ ధ్యానం॥ రక్తాంభోధి స్థపోతోల్లస దరుణ సరోజాధి రూఢా కరాబ్జైః పాశం కోదండమిక్షూద్భవ మళిగుణ మప్యంకుశంపంచబాణాన్, బిభ్రాణా సృక్కపాలం త్రినయ నసహితాపీనవక్షో రుహాఢ్యా దేవీబాలార్కవర్ణా భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరానః॥ ఓం ఆం హ్రీం క్రోంయరలవశషసహోం హంసస్సోహంస్వాహా॥ అము ష్యప్రాణా ఇహప్రాణా అముష్యజీవ ఇహస్థితః అముష్య సర్వేం ద్రియాణి చమనో బుద్ధ్యహంకార చిత్త పృథివ్యప్తే జోవాయ్వా

కాశశబ్ద స్పర్శ రూప రసగంధ శ్రోత్రత్వ క్చక్షుర్జిహ్వా ఘ్రాణ వాక్పాణిపాదపాయూపస్థవచన గమనాదానవిసర్గానంద ప్రాణాపానవ్యానోదానసమానాఇహైవాగత్యసుఖం చిరంతిష్ఠంతుస్వాహా ॥ హంసస్సోహం, అసునీతేతిమంత్రంజప్త్వా, తతోదండభంగ్యావిన్యాసానుకుర్యాత్ ॥ ఓం హౌంఈశానమూర్ధ్నేనమః,ఓం హేంతత్పురుషవక్త్రాయనమః, ఓంహూంఅఘోరహృదయాయనమః, ఓం హీం వామదేవగుహ్యాయనమః, ఓం హాంసద్యోజాతపాదాభ్యాన్నమః, ఇతిశిరోవక్త్రహృదయ గుహ్యాంఘ్రిస్థానేషు క్రమేణవిన్యసేదితిదండభంగిన్యాసః ॥ ఊర్ధ్వవక్త్రే ఓం హాంఈశానాయనమః,పూర్వవక్త్రేఓంహాంతత్పురుషాయనమః, దక్షిణవక్త్రే,ఓంహాంఅఘోరాయనమః,పశ్చిమవక్త్రే,ఓంహాంసద్యోజాతాయనమః,ఉత్తరవక్త్రే ఓంహాంవామదేవాయనమః,ఇతివక్త్రభంగిన్యాసః॥అస్యశ్రీశ్రీకంఠమాతృకాన్యాసమహామంత్రస్య, శ్రీదక్షిణామూర్తిఋషిః,గాయత్రీఛందః,అర్ధనారీశ్వరోదేవతా,హలోబీజాని,స్వరాశ్శక్తయః,బిందుకీలకం,సాంబసదాశివప్రసాదసిద్ధ్యర్థేజపేవినియోగః,హామిత్యాదికరన్యాసః,హృదయాదిన్యాసశ్చ॥ ధ్యానం॥బంధూకకాంచననిభంరుచిరాక్షమాలాం పాశాంకుశౌచవరదంనిజబాహుదండైః, బిభ్రాణమిందుశకలాభరణంత్రినేత్రమర్ధాంబికేశమనిశంవపురాశ్రయామి॥ఓం అం,శ్రీకంఠేశపూర్ణోదరీభ్యాన్నమః,శిరసి,ఓం ఆంఅనంతేశవిరజాభ్యాంనమః,లలాటే,ఓం ఇంసూక్ష్మేశశాల్మలీభ్యాన్నమః,దక్షిణచక్షుషి- ఓంఈంత్రిమూర్తీశలోలాక్షీభ్యాన్నమః- వామచక్షుషి-ఓం ఉం అమరేశవర్తులాక్షీభ్యాన్నమః- దక్షిణశ్రోత్రే- ఓం ఊం మహేశశోణాక్షీభ్యాన్నమః,వామశ్రోత్రే, ఓం ఋం భారభూతేశ దీర్ఘముఖీభ్యాన్నమః- దక్షిణనాసాపుటే- ఓంౠంనిధనేశగోముఖీభ్యాన్నమః,

వామనాసాపుటే- ఓం ౠం స్థాణ్వీశదీర్ఘజిహ్వాభ్యాంనమః- దక్షిణగండే- ఓం ఌం హరేశకుండోదరీభ్యాన్నమః- వామగండే- ఓం ఎం చండేశోర్ధ్వ కేశీభ్యాంనమః, ఊర్ధ్వోష్ఠే,ఓంఐం భౌతికేశ వికృతి ముఖీభ్యాంనమః, అధరోష్ఠే,ఓంఓంసద్యోతేశజ్వాలాముఖీభ్యాంనమః, ఊర్ధ్వదంత పంక్తౌ-ఓంఔం అనుగ్రహేశ ఉల్కాముఖీభ్యాంనమః- అధోదంతపఙ్క్తికే, ఓంఅంకౄరేశశ్రీముఖీభ్యాంనమః- మూర్ధ్ని, ఓంఅః మహాసేన విద్యాముఖీభ్యాన్నమః- వక్త్రే- ఓం కం క్రోధీశమహాకాళీభ్యాన్నమః- దక్షిణబాహౌ- ఓం ఖం చండేశ సరస్వతీభ్యాన్నమః- దక్షిణకూర్పరే- ఓంగం పంచాంతకేశ గౌరీభ్యాన్నమః-దక్షిణమణిబంధే. ఓంఘం శివోత్తమేశత్రైలోక్య వంద్యాభ్యాన్నమః- దక్షపాణితలే- ఓం ఙం ఏకరుద్రేశమంత్రశక్తిభ్యాన్నమః- దక్షకరాగ్రే- ఓం చం కూర్మేశ ఆత్మశక్తిభ్యాన్నమః, వామబాహౌ- ఓం ఛం ఏకనేత్రేశ భూతమాతృభ్యాన్నమః- వామకూర్పరే, ఓంజం చతుర్ముఖేశలంబోదరీభ్యాన్నమః- వామమణిబన్ధే- ఓం ఝం అజేశద్రావిణీభ్యాన్నమః- వామపాణితలే, ఓంఞం చండేశనగరీభ్యాన్నమః- వామకరాగ్రే, ఓంటం సోమేశఖేచరీభ్యాన్నమః- దక్షోరుమూలకే- ఓంఠం లాంగలీశమంజరీభ్యాన్నమః- దక్షజానుని- ఓండం దారుకేశరూపిణీభ్యాన్నమః- దక్షజంఘాగ్రకే- ఓం ఢం అర్ధనారీశ వీరాభ్యాన్నమః, దక్షపాదతలే- ఓం ణం ఉమాకాంతేశఖాదరీభ్యాన్నమః- దక్షపాదతలాగ్రకే, ఓంతంషడీశపూతనాభ్యాన్నమః- వామోరుమూలకే- ఓం థం డిండీశభద్రకాళీభ్యాన్నమః-వామజానుని- ఓం దం అత్రీశగోమతీభ్యాన్నమః-వామజంఘాగ్రకే- ఓం ధం ఈశానేశ శంఖినీభ్యాన్నమః- వామపాదతలే- ఓం నం మేషేశగర్జనీభ్యాంనమః-వామపాదతలాగ్రకే-ఓంపం లోహితేశ

కాళరాత్రిభ్యాన్నమః-దక్షపార్శ్వే-ఓంఫంశిఖినీశకుబ్జినీభ్యాన్నమః వామపార్శ్వే॥ఓంబంఛలగండేశకామినీభ్యాన్నమఃపృష్ఠభాగే-ఓం భంద్విరండేశవజ్రాభ్యాన్నమః, నాభిదేశే, ఓంమం మహాకాళేశ జయాభ్యాన్నమః- హృద్దేశే- ఓం యం త్వగాత్మేశ సుముఖే శ్వరీభ్యాన్నమః త్వచి- ఓం రం రక్తాత్మనేభుజంగ రేవతీభ్యా న్నమః- రుధిరస్థానే- ఓం లం వసాత్మనేపినాకీశ మాధవీభ్యాన్న మః- మాంసస్థానే- ఓంవం మెదోమయాయ ఖడ్గీశవారుణీభ్యాన్న మః- మేదసి- ఓంశం అస్థ్యాత్మనె భకాయేశవాయవీభ్యాన్నమః- అస్థిని- ఓం షం మజ్జాత్మనే శ్వేతేశరూపధారిణీభ్యాన్నమః - మజ్జ గతే- ఓం సం శుక్లాత్మనే భృగ్వీశసహజాభ్యాన్నమః- రేతసి- ఓం హం ప్రాణాత్మనే లకులీశ లక్ష్మీభ్యాన్నమః- మాంసే- ఓం ళం లింగాత్మనే తమోరూపేశ వ్యాపినీభ్యాన్నమః- లింగమూలే-ఓం క్షం క్రోధాత్మనె వర్తకేశమాయాభ్యాన్నమః-లింగాగ్రకే॥ ఇతి శ్రీకంఠన్యాసః ॥*॥ అథ మత్రాక్షరన్యాసః ॥*॥ అంకుష్ఠే- ఆంల లాటే- ఇం ఈం నేత్రయోః - ఉం ఊం శ్రవణయోః - ఋం ౠం కపోలయోః- ఌం ౡం- నాసాపుటద్వయె - ఎం ఉత్త రోష్ఠే- ఐం అధరోష్ఠే- ఓంఔం దంతపఙ్క్తిద్వయే- అంఅః తాలుద్వయే- కంఖంగంఘంఙం దక్షిణహస్తే-చంఛంజంఝంఞం-వా మహస్తే- టంఠండంఢంణం-ఉదరే,తంథందంధంనం-దక్షిణపార్శ్వే పంఫంబంభంమం- వామపార్శ్వే- యంరంలంవం దక్షిణేపాదే- శంషంసంహంళంక్షంవామపాదే- హం హృదయే ఏవం విన్యసేది తి మంత్రాక్షరన్యాసః ॥ * ॥ అంతమార్తృకా ॥*॥అస్యశ్రీ అంత మార్తృకాసరస్వతిన్యాస మహామంత్రస్య- బ్రహ్మఋషిః- గాయ త్రీఛందః- అన్తమార్తృకాసరస్వతీదేవతా- హలోబీజాని-స్వరా శ్శక్తయః- బిన్దవఃకీలకం- అన్తమార్తృకా సరస్వతీప్రసాద సిద్ధ్య

థః జపేవినియోగః- అంకంఖంగంఘంజంఆం అంగుష్ఠాభ్యా
న్నమః - ఇంచంఛంజంఝంఞం ఈం తర్జనీభ్యాన్నమః - ఉం
టంఠండంఢంణంఊం మధ్యమాభ్యాంనమః- ఎంతంథందంధం
నంఐం అనామికాభ్యాన్నమః- ఓం పంఫంబం భంమం ఔం-
కనిష్ఠికాభ్యాంనమః_యంరంలంవంశంషంసంహంళంక్షంఅః-కర
తలకరపృష్ఠాభ్యాన్నమః- ఏవం హృదయాదిన్యాసః- భూర్భుః
వస్సువరోమితి దిగ్బన్ధః ॥ ధ్యానం ॥ ఓంకారీం తనుమాత్మప
ఞ్చమనిభాం షట్చక్రసఞ్చారిణీంఈడాపిఙ్గళమధ్యవర్తివిలసద్బ్ర
హ్మాణ్డమధ్యస్థితామ్ । ఇందుంబాణధరాం ధనుర్వరకరాంపుష్పా
యుధాంమోహినీం తారాపూర్ణముఖీంభజేసుఖకరీమన్తర్మహా
మాతృకామ్ ॥లమిత్యాదిపంచపూజా॥ మూలాధారే-ఓంవంనమః-
ఓంశంనమః- ఓంషంనమః-ఓంసంనమః-స్వాధిష్ఠానే ॥ ఓంబంన
మః- ఓంభంనమః- ఓంమంనమః-ఓంయంనమః- ఓం రంనమః-
ఓంలంనమః ॥ మణిపూరకే ॥ ఓండంనమః- ఓంఢం నమః-ఓం
ణంనమః- ఓంతంనమః- ఓంథంనమః_ ఓందంనమః - ఓం ధం న
మః- ఓంనంనమః-ఓంపంనమః- ఓం ఫంనమః- అనాహతే॥ఓం
కంనమః, ఓంఖంనమః- ఓంగంనమః_ ఓంఘంనమః-ఓంఙంనమః-
ఓంచంనమః- ఓంఛంనమః- ఓంజంనమః- ఓంఝంనమః, ఓం
ఞంనమః,ఓంటంనమః, ఓంఠంనమః ॥ విశుద్ధే ॥ ఓంఅంనమః,ఓంఆం
నమః,ఓంఇంనమః,ఓంఈంనమః,ఓంఉంనమః_ఓంఊంనమః-ఓంఋంన
మః, ఓంౠన్నమః, ఓంఌంనమః, ఓంౡంనమః, ఓం ఏంనమః-
ఓంఐన్నమః- ఓంఓన్నమః, ఓం ఔన్నమః, ఓం అం నమః, ఓం
అః నమః- ఆజ్ఞాచక్రే ॥ ఓంహంనమః- ఓం క్షన్నమః ఇతి షడా
ధారన్యాసః ॥*॥ అథఅష్టత్రింశత్కలాన్యాసః ॥*॥ అస్యశ్రీఈశా
నాదిపంచబ్రహ్మమహామంత్రస్య- భారద్వాజగౌతమాత్ర్యఙ్గిరో

విశ్వామిత్రాఋషయః విరాడ్గాయత్ర్యనుష్టుప్త్రిష్టుబ్జగత్యశ్ఛందాం సి, సర్వేంద్రరుద్రవిష్ణుబ్రహ్మాణశ్చ దేవతాః- హాలోబీజాని- స్వరాశ్చ శక్తయః, ఋంకీలకం-మమశరీరస్యకలాసాన్నిధ్యసిద్ధ్యర్థేజపేవినియోగః ॥ ఈశానస్సర్వవిద్యానాం-ఓంహాం†శశినీకలాయైనమః, ఊర్ధ్వే మూర్ధ్ని, ఈశ్వరస్సర్వ భూతానామ్॥ ఓం హాం¶అంగదాకలాయైనమః, పూర్వమూర్ధ్ని, బ్రహ్మాధిపతి బ్రహ్మణో ధిపతిబ్రహ్మా, ఓంహాంయిష్టాకలాయైనమః, యామ్యమూర్ధ్ని శివోమేఅస్తు, ఓంహాం మరీచికలాయై నమః- కౌబేర మూర్ధ్ని, సదాశివోమ్, జ్వాలినీ కలాయై, పశ్చిమ శిరసి, ఇతి సాంగుష్ఠముష్టినావిన్యస్య ॥ తత్పురుషాయవిద్మహే, విద్యాకలాయై,పూర్వవక్త్రే, మహాదేవాయధీమహి, ఓం హాం ప్రతిష్ఠాకలాయైనమః, దక్షిణాననే- తన్నోరుద్రఃప్రచోదయాత్, ఓంహాంనివృత్తికలాయై, పశ్చిమవక్త్రే ॥ ఇత్యంగుష్ఠ తర్జనీభ్యాం విన్యస్య, అఘోరేభ్యః ఓం హాం తమఃకళాయై, హృది, అథఘోరేభ్యఃఓం హాం మోహాకళాయై,కంఠే,ఘోర,ఓంహాంరక్షాకలాయై,దక్షాంసే, ఘోరతరేభ్యః, ఓం హాంనిష్ఠాకళాయై, వామాంసే, సర్వేభ్యస్సర్వఓంహాం మృత్యుకళాయై, నాభౌ, శర్వేభ్యః ఓం హాం మాయాకళాయై, జఠరే, నమస్తే, అస్తురుద్ర, అభయ కళాయై, పృష్ఠే, రూపేభ్యః ఓంహాంజరాకళాయై, ఉరసి, ఇత్యంగుష్ఠ మధ్యమాభ్యాం ॥ ❋ ॥ వామదేవాయ నమః, ఓం హాం రజఃకలాయై, గుహ్యే, జ్యేష్ఠాయనమః, ఓం హాం రక్షాకలాయై, లింగే, శ్రేష్ఠాయనమోరుద్రాయనమః, ఓంహాంరతికలాయై, దక్షిణోరౌ - కాలాయనమః, ఓంహాం పాలీకలాయై, వామఊరౌ ॥ కల ఓం హాం కామకలాయై, దక్షజానుని- వికరణాయనమః, ఓం హాంసంయమీ

† శాంతికలాయైనమః, ¶ విద్యాకలాయైనమఃపాఠాంతరం॥

కలాయై, వామజానుని, బల ఓంహాంక్రియాకలాయై, దక్షజంఘా యాం, వికరణాయనమః, ఓం హాం బుద్ధికలాయై, వామజంఘా యాం, బలాయనమోబలఓంహాంకార్యాకలాయై, దక్షిణస్ఫిజి, ప్ర మథనాయనమః, ఓంహాంధాత్రీకలాయైనమఃవామస్ఫిజిఓంనమః, బ్రా హ్మణీకలాయై, కట్యాం- సర్వభూతదమనాయనమః మనఓంహాం మోహినీకలాయైన, దక్షపార్శ్వే, ఉన్మనాయనమః, ఓంహాంభవాక శాయైనమః- వామపార్శ్వే ॥ ఇత్యంగుష్ఠానామికాభ్యాంవిన్యస్య॥ సద్యోజాతంప్రపద్యామి- ఓం హాం సిద్ధికలాయై - దక్షిణపాదే సద్యోజాతాయవైనమోనమః- ఓం హాం బుద్ధికలాయై- వామాం ఘ్రికే- భవేనమః ఓం హాం ద్యుతికలాయై- దక్షిణహస్తే- అ భవేనమః ఓం హాం లక్ష్మీకలాయైనమః- వామకరే- నాతిభవే మేధాకలాయైన- నాసికాగ్రే- భవస్వమాం- ఓం హాం కాం తికలాయై- శిరసి- భవ- స్వధాకలాయై- దక్షిణబాహుకే- ఉ ద్భవాయనమః- ఓం హాం ధృతికలాయై- వామబాహుకే- ఇ త్యంగుష్ఠకనిష్ఠికాభ్యాంవిన్యస్య ॥ తతోగురుహృదయాదిమంత్రై ర్హృదయాద్యంగానిసంస్పృశేత్- * ఓం నం నమః- శిరసి- ఓం మంనమః- ముఖే- ఓం శింనమః- హృదయే- ఓం వంనమః- గుహ్యే- ఓం యంనమః - పాదయోః - ఇతిపంచాక్షరన్యాసః, ఓం హ్యాం శాంత్యతీతకలాయైన- శిరసి- ఓం హాం శాంతికలా యై- లలాటే- ఓం హూం విద్యాకలాయై- కంఠే- ఓం హ్వాం ప్రతిష్ఠాకలాయై- నాభౌ- ఓం హ్లాంనివృత్తికలాయై-జాన్వోః ॥ ఇ తిపంచకలాన్యాసః॥ ఓంఓంఓంమూర్ధాదిపాదపర్యంతంవిన్యసేత్- హాంహాంహాంహాంపాదాదిమస్తకాంతంవిన్యసేత్- హాం హాం హాంహాంభ్రూమధ్యాదిమస్తకాంతంన్యసేత్- శ్రీం శ్రీం శ్రీంశ్రీం శివశక్త్యాత్మనేశివాయనమః-ఓంహాంఅవ్యక్తకలాయై ఓం హాంహీం

హూం హ్రైం హౌం హః ఇతి పాదాదిమస్తకాంతం విన్యసేత్- శి
వోహమితి భావయేదిత్యమృతప్లావనం ॥ తతః అంతర్హృదయాకా
శే- దివ్యరత్నమయం శివార్చనమంటపం మనసా సంకల్ప్య- తత్రశి
వార్చనోపయుక్తాని సర్వద్రవ్యాణి మనసోపనీయ- విశోధ్య- ద్వా
దశాంతస్థితచంద్రమండలస్రవదమృతధారయా ఘ్యణా పాత్రాదిపూ
రణసంస్కారం కృత్వా- ద్వారపాలార్చనం విధాయ- వక్ష్యమా
ణప్రకారేణ గణేశగురుపఙ్క్త్యనుజ్ఞాప్రార్థనపూర్వకం- మాణిక్య
వర్ణనాభికందసముత్థితనీలవర్ణనాళాన్విత ధవళవర్ణాష్టదళహృద
యకమలకర్ణికాసంస్థిత కుండలినీశక్తిరూపం జీవాత్మకేపిరేశ్రవణాం
గుష్ఠసంయోగాదిగమ్య నాదరూపదీపశిఖాకారం లింగం విచింత్య-
పీఠే వక్ష్యమాణప్రకారేణ శక్త్యాదిశక్త్యంతం శివాసనమభ్యర్చ్య-
లింగే శివమూర్తిం విద్యాదేహం చాభ్యర్చ్య- తత్ర పరమశివమావా
హనాదిక్రమేణాద్యంతసంస్కారైరభిపూజ్య- ద్వాదశాంతస్రుతబ
హుళామృతధారయాభిషిచ్య- వస్త్రాభరణాదిశ్వైరాగ్యచందనే
నచాలంకృత్య- అహింసాపుష్పం సమర్పయామీత్యాదిప్రకారేణ అ
హింసేంద్రియనిగ్రహక్షమాదయాజ్ఞానతపస్సత్యభావరూపైః పు
ష్పైరభ్యర్చయేత్- తతో మనః పాత్రే ప్రాణాగ్నౌ మహంకార
ధూమశిఖాం చ పరికల్ప్య- ధూపం దద్యాత్- శివజ్ఞానమేవ దీపం
సంకల్ప్య- దద్యాత్- విశేషేభ్యః ప్రత్యాహృతం మనో నైవేద్యమి
తి భావయిత్వా- సమర్పయేత్- పార్థివాదిపంచధారణాః స్థిరీకృత్య-
సదాశివావయవజాతధ్యానకల్పితైస్తత్తదవయవోచితైర్భూషణై
స్సుభూషయేత్- శివోహమితి శివసామ్యభావనామాత్రం నివేదనం చ కు
ర్యాత్- యద్వాభిషేకానంతరం- గంధశబ్దరూపరసతన్మాత్రా
శ్చందనపుష్పధూపదీపనైవేద్యాత్మనా సమర్పయేత్- తత్రాయం
క్రమః- మూలమంత్రోచ్చారణపూర్వకం- హ్రాం సద్యోజాతాయ

శివాయగంధతన్మాత్రాత్మకచందనంసమర్పయామి- హ్రాంఈశా
నాయశివాయశబ్దతన్మాత్రాత్మకపుష్పంసమర్పయామి- హ్రైంత
త్పురుషాయ శివాయస్పర్శత న్మాత్రాత్మకధూపం సమర్పయామి-
హ్రూంఅఘోరాయశివాయరూపతన్మాత్రాత్మకదీపంసమర్పయా
మి ॥ హ్రీంవామదేవాయ శివాయరసతన్మాత్రాత్మక నైవేద్యంస
మర్పయామి॥తతోహస్త ప్రక్షాళనముఖవాసదానానంతరంసత్వర
జస్తమోగుణాత్మక తాంబూలంసమర్పయామి- తతోనీరాజనంప
రికల్ప్య। బుద్ధిస్థవాయునాక్లుప్తం దర్పణంమంగళానిచ। మనో
వృత్తివిచిత్రా తేనృత్తరూపేణకల్పితా। ధ్వనయోగీతరూపేణశబ్దా
వాద్యప్రభేదతః। సుషుమ్నాధ్వజరూపేణ ప్రాణాద్యాశ్చామరాత్మ
నా-అహంకారోగజత్వేనక్లుప్తోదేహోరథాత్మనా।మనఃప్రగ్రహ
రూపేణబుద్ధిస్సారథిరూపతః। సర్వమన్యన్మయాక్లుప్తంతవోపకర
ణాత్మనేతి। సర్వమాత్మీయంబుద్ధిమనః ప్రాణాదికంశివపూజోప
కరణత్వేన సమర్పయామి- ఆవరణపూజామపివక్ష్యమాణరూపాం
తత్సమర్పణంకుర్యాత్- తతఃప్రదక్షిణనమస్కారైశ్శివంప్రసాదాభి
ముఖంవిధాయ- తదాజ్ఞయాగ్నికార్యంకుర్యాత్-నాభౌత్రిమేఖల
కుండంతత్రాగ్నించస్వతస్సిద్ధంవిభావ్య- తమగ్నిమస్త్రేణప్రజ్వా
ల్య- తత్రాగ్నౌకంచిదంగారంక్రవ్యాదాంశత్వేనభావయిత్వా-
తంనిఋతికోణేపరిత్యజ్య- కుండస్థమగ్నింనిరీక్షణాదిభిస్సంశో
ధ్య, తస్యశివాగ్నిత్వసిద్ధ్యర్థంరేచకేనతం చైతన్యాత్మనాహృదయం
నీత్వా, తత్రత్యేనజ్ఞానాగ్నినాసంయోజ్య, తతస్సుషుమ్నయాద్వా
దశాంతంనీత్వా, తత్రపరమశివేనసంయోజ్య, తేజఃపుంజపింజరం
సూర్యాయుతసమప్రభంభావయేదితిసంజ్ఞానాగ్నిరూపంప్రత్యానీ
య నాభికుండేస్థాపయేత్.ఏవంకృతేసంస్కారాంతరమనపేక్ష్యశి
వాగ్నిర్భవతి, తత్రశివాగ్నింరక్తవర్ణం చతుర్వక్త్రందశభుజంస

దాశివసమానాయుధంధ్యాత్వా, తస్యహృదయకమలే ఆసనమూ
ర్తింవిద్యాదేహవిన్యాసపురస్సరంశివమావాహ్య, సుషుమ్నాస్రవే
ణద్వాదశాంతంకృత్వా, అమృతధారాజ్యం మూలేనాష్టోత్తరశత
మష్టావింశతివారమష్ట వారంవాజుహుయాత్, శాక్తామృతఘృతప
రిపూర్ణనాభికందకలశాం హృదయకమలాత్మికకుసుమాంవిభావ్యత
యాహుంశక్తయేవౌషడితి పూర్ణాహుతింహుత్వా, హోమసంత
ర్పితంశివాగ్నిం నాభిమార్గేణహృత్పద్మపూజితే శివేసంయోజ్య, అ
ష్టపుష్పైస్సమభ్యర్చ్య, పూజాంసమర్పయేత్ ॥ * తదనంతరం
భ్రూమధ్యేసర్వావయవసంపూర్ణంశుద్ధదీపసమాకృతించశివంసక
లనిష్కళస్వరూపేణధ్యాత్వా, శివఃపూజ్యపూజకభావేనద్విధాస్థి
తశ్శివోహమితిమన శ్శివఆదధీతేతి, * దేవస్యాగ్రస్థానశుద్ధ్యర్థం
అస్త్రమంత్రేణచతురశ్రమండలంకృత్వా, హృదయమంత్రేణధరాం
పార్థ్యాభ్యర్చ్య, ధనుర్ధరాయేతి గాయత్రీంజప్త్వా, ఊర్ధ్వాభిము
ఖాకరౌకృత్వా, ఓం హః అస్త్రాయహుంఫడితితాళత్రయేణతథా
ఛోటికయాదశదిక్షువిఘ్నానుత్సార్య, అస్త్రేణజ్వలదగ్నివర్ణప్రా
కారంకృత్వా, తద్బహిః, కవచేనదక్షిణకర తర్జనీభ్రమణేనపరిఘాం
కృత్వాస్త్రమంత్రేణశక్తయేవౌషడితిఊర్ధ్వాధఃపరితశ్ఛవిభావ్య
మహాముద్రాంధేనుముద్రాంచదర్శయేదితిస్థానశుద్ధిః॥*॥తతఃద్రవ్య
శుద్ధ్యర్థంవక్ష్యమాణపూజోపకరణయోగ్య ద్రవ్యపాత్రాణియథా
లాభసర్వద్రవ్యజాలంచాహృత్య, శివస్యాగ్రస్థండిలోపరివాఆధారో
పరివాపిన్యసేత్, పాద్యాదిషోడశపాత్రాణివాద్వాదశనవాష్టపంచ
పాత్రాణివాయథాలాభపాత్రాణిక్రమేణవిన్యస్య, మధ్యస్థానేవి
శేషార్ఘ్యమైంద్ర్యాం నిరోధార్ఘ్యం దక్షిణస్యాంపరాఙ్ముఖా
ర్ఘ్యముత్తరస్యామాచమనపాత్రంప్రతీచ్యాంపాద్యపాత్రమగ్నే
శంఖంవర్ధనీంచమూలమంత్రేణస్థాపయేత్, పూర్వస్యాంమండలోపరి

పంచామృతపాత్రాణిపశ్చిమాయాం పంచగవ్యపాత్రాణిఉత్తరా యాంస్నపనకలశాన్ ప్రాచ్యాంద్రవ్యపాత్రాణివిన్యస్య,పంచవారం మూలేనతత్త్వదృష్ట్యానిరీక్ష్య, తతోవర్ధన్యామస్త్రమంత్రేణగంధతో యేనాపూర్య, నిరీక్షణాదిభిశ్శుద్ధాంఘంటాంసంగృహ్య, ఆగమా ర్థంతుదేవానామితి నాదయిత్వా, విఘ్నానుత్సార్య, మహాదేవ స్యపూజార్థం దేశకాలౌసంకీర్త్య, ఆపోవాఇతిమంత్రేణవర్ధనీమభ్య ర్చ్య, తన్మధ్యేమూలేనశివంసంపూజ్య, గంధాక్షతపుష్పైరలంకృ త్య, శంఖముద్రాం తార్క్ష్యముద్రాం ధేనుముద్రాంప్రదర్శయేత్ అమృతీకరణంకృత్వా, తేనతోయేనసర్వద్రవ్యాణిప్రోక్షయేత్, త చ్ఛంఖంక్షాళయిత్వా ॥ వర్ధనీ జలేన హృదయ మంత్రేణాపూ ర్య ॥ ధ్యాత్వా ॥ నిశాకరం † సర్వ దేవతాః ॥ ఇతి ధ్యా త్వా ॥ తత్తన్నామ్నా గంధ పుష్పాదిభిస్సంపూజ్య ॥ మధ్యే॥ సద్యోజాత వామాఘోర తత్పురుషేశాన హృదయ శిరశ్శిఖాక వచ నేత్రాస్త్రదేవతాస్సంపూజ్య ॥ పద్మ ముద్రాం మహాము ద్రాం మృగీ ముద్రాంచ దర్శయేత్ ॥ తతశ్శంఖోదకేన విశేషా ర్ఘ్యాది పాత్రాణి ప్రోక్షయేదితి శంఖార్చనవిధిః॥

చందనోశీర కర్పూర ద్రవ్యాణి పాద్యపాత్రే, జాతీ కర్పూర రతక్కోల లవంగ కుసుమాన్యాచమనీయే ॥ చందన కర్పూర కుశాగ్రాక్షత యవ వ్రీహి తిలాజ్య సిద్ధార్థైలా సుమభసితా న్య ర్ఘ్యపాత్రే ॥ చందనకర్పూర జాతీ చంపకాదికుసుమాని స్నా నపాత్రేనిక్షిపేత్। తతోగురుర్వర్ధనీ తోయేనార్ఘ్యాది పాత్రా ణ్యాపూర్య ॥ పంచబ్రహ్మ షడంగమంత్రైర్విశేషార్ఘ్యమభ్య ర్చ్య ॥ తతస్సద్యోజాతాది బ్రహ్మపంచకైర్నిరోధార్ఘ్య మం త్రైః పరాఙ్ముఖార్ఘ్యం సంపూజ్య, హేతినాసామాన్యార్ఘ్యం క్రమాచ్ఛివ గాయత్ర్యా సావిత్ర్యాచాభిమంత్ర్య। పాద్యాది

బ్రహ్మాణి రంగైశ్చ అస్త్రేణాచమనం సంపూజ్య, క్రమాదుద్ధృత్యేత్యాపోహిష్ఠేతి ద్వాభ్యాం మంత్రాభ్యాం సంపూజ్య, వౌషడిత్యుచ్చరన్, అస్త్రేణ దిగ్బంధనం కవచేనావకుంఠన మమృతీకరణమాచరేద్ధేను ముద్రాం ప్రదర్శయేత్ ॥ కవచేన పూజాద్రవ్యాణి సర్వాణి వారుణ సూక్తేనవా ప్రోక్షయేత్ । తతో విశేషార్ఘ్యజలేన స్నానతోయమభిమంత్ర్య ప్రాసాదేన గంధకుశ పుష్పాక్షతాన్నిక్షిప్య ॥ తతో భూషణగంధవస్త్ర కుసుమాదీని సర్వద్రవ్యాణి సద్య వామాఘోర నరేశైర్మంత్రైరభి మంత్రయేత్, గాయత్ర్యా విశేషార్ఘ్యజలేన జంబ్వామ్ర కుశనారంగపనసేక్షు రసద్రాక్షాఖర్జూర జంబీర నారికేళోదకాదీని షడంగ మంత్రైర్వా పవమాన స్సువజన ఇత్యనువాకేనవా ప్రోక్షయేత్ । గంధపుష్పాదిభిస్సంపూజ్య॥ ... ... ... *

తతో గురుః పంచగవ్య పూజార్థం విధివన్నవకోష్ఠ మండలం విధాయ ॥ దర్భైః పుష్పైర్వా పరిస్తీర్య ॥ మధ్య కోష్ఠే శివతత్త్వం పూర్వే సదాశివ తత్త్వమాగ్నేయ్యాం మనస్తత్త్వం దక్షిణస్యాం విద్యాతత్త్వం నైఋత్యాం బుద్ధితత్త్వం ప్రతీచ్యాం కాలతత్త్వం వాయవ్యామహంకారతత్త్వ ముత్తరస్యాం పురుష తత్త్వమైశాన్యామాత్మతత్త్వం విన్యస్యాభ్యర్చ్య ॥ మధ్యమ పాత్రే ఘృతం పూర్వే దధి, యామ్యే క్షీరం పశ్చిమే గోమూత్ర ముత్తరే గోమయమాగ్నేయ్యాం నారికేళం నైఋత్యాం క్షౌద్రం వాయవ్యాం కుశోదక మైశాన్యాం గంధతోయం ॥ సుప్రతిష్ఠిత పాత్రే సుశాంత పాత్రే తేజోరూప పాత్రామృత పాత్రావ్యక్త పాత్రే సర్వపాత్రరూప పాత్రే గుణ పాత్రేషు హృదయాది క్రమేణ విన్యసేత్, ఈశానేన ఘృతం, తత్పురుషేణ దధి, అఘోరేణ క్షీరమ్॥ వామదేవేన గోమయం, సద్యోజాతేన గోమూత్రమ్, శివాంగై

ర్నారి కేళమ్, విద్యాంగైః క్షౌద్రం ప్రాసాదబీజైః కుశోదకమ్
హృదా గంధతోయం, క్రమేణాభిమంత్ర్య, శుక్రమసీత్యాజ్యమ్॥
దధిక్రావ్ణ్ణోతి దధి ॥ ఆప్యాయస్వేతి క్షీరమ్ ॥ గంధ ద్వారేతి
గోమయమ్ ॥ గాయత్ర్యా గోమూత్రమ్ ॥ యాః ఫలినీత్యేతి నా
రికేళమ్ ॥ మధు వాతేతి క్షౌద్రమ్ ॥ దేవస్యత్వేతి కుశోదకమ్॥
గంధద్వారేతి గంధోదకమ్ ॥ ఆవాహనాదిభిరుపచారైః గంధపు
ష్పాదిభిర్యజేత్ ॥ రక్షావకుంఠనం కృత్వా ధేను ముద్రాం ప్రద
ర్శ్య ॥ గోమూత్రం గోమయే నిధాయ ॥ గోమయం క్షీరే॥ క్షీ
రం దధిని ॥ దధి ఘృతే ॥ ఘృతం కుశజలే ॥ నారికేళోదకం
క్షౌద్రే ॥ క్షౌద్రం గంధజలే ॥ గంధజలం కుశతోయే సంయో
జ్య ॥ బ్రహ్మాంగ మంత్రైరష్టోత్తర శతవారమష్టావింశతి వారం
వాభిమంత్ర్య ॥ గంధ పుష్పాక్షతైరభ్యర్చ్య ॥ మహాము
ద్రాం దర్శయేదితి పంచగవ్యవిధిః॥ ... *

తతః పంచామృతస్నపనార్థం పంచగవ్యస్యపురోభాగే పూ
ర్వవత్ స్థండిలం కృత్వా ॥ తన్మధ్యే నవకోష్ఠాని సంలిఖ్య॥ స్వర్ణ
దువర్ణ కాంస్యైర్వా నిర్మిత పాత్రాణి సంగ్రాహ్య పృథక్పృ
థక్ ప్రస్థమానం తదర్ధార్ధం వా పంచామృత ద్రవ్యాణి చాహృత్య
మధ్యే దుగ్ధం దధి ప్రాచ్యాం దక్షిణస్యాం ఘృతమ్ ఉత్తరస్యాం మధు ప్ర
తీచ్యాం శర్కరామాగ్నేయ్యాం కదళీఫలం నైరృత్యాం నా
రికేళోదకమ్ ॥ వాయవ్యాం మాతులఫల మైశాన్యాం గంధతోయం
నిధాయ ॥ అంబాం గణాంబికాం గంగాం గౌరీం మనోన్మనీం
దుగ్ధాది క్రమేణాభ్యర్చ్య ॥ తతో గురురాప్యాయస్వేతి క్షీరమ్॥
దధిక్రావ్ణ్ణోతి దధి ॥ శుక్రమసీత్యాజ్యమ్ ॥ మధువాతేతి మధు
స్వాదుః పవస్వేతి శర్కరామ్ ॥ ఇత్యేతైః మంత్రైః క్రమాత్స
ద్యోజాతాది పంచమంత్రైశ్చ గంధపుష్పాదిభిర్యజేత్ ॥ హృద

యమంత్రేణ కదళీంశిరోమంత్రేణ నారికేళ జలంశిఖామంత్రేణ రసాలమస్త్రమంత్రేణ గంధతోయమ్ ॥ ఏతైర్మంత్రైరభ్యర్చ్య ॥ ధేనుశూలపద్మముద్రాః ప్రదర్శ్యమోదితిపంచామృతవిధిః ॥ * ॥ తతస్స్నపనార్థమస్త్రేణ భూమిం శోధయేత్ ॥ వామదేవేన గంధజలేనానులిప్య ॥ తస్యోపరితిలతండులవ్రీహిభిర్యథావత్స్థండిలం కృత్వా ॥ నిత్యార్చన విధౌ ॥ ఉత్తమోత్తమాదిపూజాభేదేనైకకలశాద్యష్టోత్తరశతకలశస్నపనమధ్యే యథాలాభనవ పంచైకకలశస్నపనానివా కుర్యాత్తత్ర నవకలశస్నపనపక్షే మధ్యే మహేశం పరితశ్చాష్టవిద్యేశ్వరాన్ తత్తన్మంత్రేణాభ్యర్చ్య ॥ పంచ కలశ స్నపన పక్షేమధ్యే । ఈశానమ్ ॥ పూర్వభాగే తత్పురుషం దక్షిణ కలశే అఘోర ముత్తర కలశే వామదేవం పశ్చిమ కలశే సద్యోజాత మిత్యావాహ్య తత్తన్మంత్రేణార్చయేత్ ॥ ఏకకలశస్నపనపక్షేమనోన్మనీసహితమహేశం సంపూజ్య ॥స్థండిలం తత్పురుషమ మంత్రేణపరికల్ప్య ॥ శివగాయత్ర్యా ప్రోక్ష్య ॥ ఆపోహిష్ఠేతి మంత్రేణ కలశాన్ప్రక్షాళ్య ॥ చందనపంకేనానులిప్య ॥ తంతుం తన్వన్నితి తంతునా సంవేష్ట్య ॥ ఆకలశేష్వితి కలశాన్నిధాయ ॥ సుగంధ ద్రవ్యైరన్వితతోయేన స్వాదిష్ఠయేతి మంత్రేణాపూర్య ॥ హిరణ్యరూపేతిహిరణ్యం నిక్షిప్య ॥ పంచ దర్భైః కృత కూర్చం మూలేన విన్యస్య ॥ హృదయేనపల్లవాన్శిఖామంత్రేణ నారికేళం విన్యస్య ॥ కవచేన గంధమాల్యైరలంకృత్య ॥ వస్త్రయుగ్మేనావేష్ట్య ॥ తన్మూలేనావాహ్య ॥ ఏకకలశపక్షే ॥ త్వమగ్నే రుద్రఇతిమంత్రేణ కుంభం స్పృష్ట్వా ॥ అష్టావింశతి వారం ప్రాసాదమంత్రం జపేత్తస్మిన్ గౌరీమిమాయేతి గౌరీ మావాహ్య తద్గాయత్రీ మష్టవారం జప్త్వా ॥ ధేనుముద్రాంశూలముద్రాం మహాముద్రాం హే

తివాప్రదర్శ్య ॥ పంచాస్త్రమంత్రాన్న్యాసోక్తంచ జప్త్వా ॥
ఛోటికయాస్త్రమంత్రేణ దిగ్బంధనం కృత్వా॥ ఆవాహనాది
పూజాంతం ప్రాసాదమంత్రైః ప్రకల్ప్య॥ప్రణమ్య ప్రార్థయేదితి
స్నపనకలశార్చన విధిః॥          ...          ...          *

స్వశిరస్యర్ఘ్యజలబిందు మస్త్రేణనిక్షిప్య ॥ స్వాసనే ॥ ఓం
హాంశివాసనాయనమః ॥ పుష్పం దత్వా ॥ మూర్తిం విన్యస్య ॥
చందనేన లలాటేతిలకంకృత్వా ॥ మూలేన స్వశిరసి పుష్పమారో
ప్య ॥ ఆత్మని పశుబుద్ధిం త్యక్త్వా శివోహమితి భావయేదిత్యా
త్మపూజా ॥ అథమంత్ర శుద్ధిః ॥ హృద్యంజలింబధ్వా॥ బింద్వం
తం బ్రహ్మరంధ్రాంతం శిఖాంతంవాహ్రస్వదీర్ఘప్లుత సూక్ష్మా
తిసూక్ష్మ యుక్తాన్ ప్రణవాది నమోంతమంత్రాన్ క్రమేణ త్రివా
రంశనైర్మూలమంత్రోచ్చారణంకుర్యాత్ బ్రహ్మాంగాదీనామపితథై
వోచ్చారణంకుర్యాదితి కేవలపూజార్థం మిశ్రేతుతత్తత్పూజాసమ
యేతత్తన్మంత్రోచ్చారణంకార్యమితి మంత్రశుద్ధిః॥

తతోగురుస్సామాన్యార్ఘ్యతోయేన వృషగాయత్ర్యా వృష
భం సంప్రోక్ష్య ॥ ఓం వంవృషభాయనమః॥తీక్ష్ణశృంగం † వృషే
శ్వరమ్ ॥ యస్య శృంగస్య వృషభఇతి మంత్రేణ షోడశోపచారై
రభ్యర్చ్య ॥ ధేనుముద్రాంప్రదర్శ్య॥ ఇతివృషభార్చనవిధిః॥

తతఃప్రాసాదపరివారార్చనం గురుర్వాపుత్రశిష్యైర్వాద్వా
రార్చనాత్పరేవాపూర్వంవా వృషభార్చనాత్పరేవాకారయేత్ ॥త
తస్సోమసూత్రం దసమీపమాసాద్య, శక్త్యాదిశక్త్యంతమాసనాని
పరికల్ప్య, ఉద్యద్భానునిభం + శ్రీహస్తమీశంభజే ॥ త్వామగ్నేరు
ద్రాతిమంత్రేణగాయత్ర్యా చావాహనాదిభిస్సంపూజ్య, లింగము
ద్రాం యోనిముద్రాం పద్మముద్రాంచప్రదర్శయేత్ ॥ తతోనటే
శ్వరంసంపూజ్య ॥ శయ్యాపస్మారమూర్ధస్థిత † దక్షపార్శ్వేవ

హంతిం ॥కద్రుద్రాయేతిమంత్రేణావాహనాదిభిస్సంపూజ్య ॥ తతః
ఉమామహేశ్వరంపూజయేత్ ॥ ధవళాంగముమాసహితం +
కలయేసకలాగమమూలపదం ॥ ఋతంసత్యమితిమంత్రేణ గౌరీగా
యత్ర్యాభ్యర్చ్య,శూలముద్రాంప్రదర్శ్య ॥ తతశ్చశశిశేఖరమా
సాద్య, అభయవరదహస్తం † పద్మపీఠోపరిస్థం ॥ శ్యామాం +
పీఠాం ॥ ఏషతేరుద్రభాగ ఇతిమంత్రేణ పాశుపాదేనచపూర్వవద
భ్యర్చ్య । మృగీపరశుముద్రే చమూలేనప్రదర్శయేత్ ॥ తతఃకి
రాతమూర్తింయజేత్ ॥ చతుర్భుజం + అర్జునాన్వితం ॥ యాత
ఇషుశ్శివతమేతిమంత్రేణ దశసంస్కారానాచరేత్ ॥ తతోదక్షిణా
మూర్తిసమీపమాసాద్య ॥ పూర్వవదాసనానిపరికల్ప్య ॥ భూతి
వ్యాపాండురాంగ + దక్షిణామూర్తిరీశః ॥ యోవేదాదౌస్వరఇతి
ఈశానస్సర్వవిద్యానామితిచమంత్రేణవిధివత్సంపూజ్య- జ్ఞానము
ద్రాంప్రదర్శ్య, మాలింజప్త్వా, శూలముద్రాం పద్మముద్రాం
మహాముద్రాం ప్రదర్శయేత్ ॥ తతోవీరభద్రమభ్యర్చ్య ॥ చం
ద్రాస్యం + శ్రీవీరభద్రంభజే ॥ కద్రుద్రాయప్రచేతసేభ్యఇతిద్వా
భ్యా మావాహనాదిభిఃపూర్వవదభ్యర్చ్య పద్మశూలఖడ్గముద్రాః
ప్రదర్శ్య, తద్వామపార్శ్వే † రక్తవస్త్రాం ॥ భద్రకాళింపరాం
శివాం, కాత్యాయనాగ్నిత్వమితిమంత్రాభ్యాం సంపూజ్య, ఖడ్గ
ముద్రాంప్రదర్శ్య ॥ తతస్స్కందంపూజయేత్ ॥ శక్త్యాదిశక్తిప
ర్యంత మాసనానిపరికల్ప్య † దేవసేనా సమన్వితః ॥ కల్ప
ద్రుమంప్రణమతాం † దండధరదక్షిణహస్తమీడే ॥ వందేసిందూ
రకాంతిం † శూలమసై శ్చధానం ॥ యదక్రందఃప్రథమయత్రతబా
ణాస్సంపతంత్వితిద్వాభ్యాం షణ్ముఖగాయత్ర్యా మూలేనచవిధి
వత్సంపూజ్య, శక్తివజ్రముద్రేప్రదర్శ్య, సవ్యపార్శ్వే ॥ శ్యా
మాముత్పలధారిణీం + వల్లింబికాంభావయేత్ ॥ వామపార్శ్వే -

పీతాముత్పలధారిణీం † దేవీంత్రిభంగింభజే ॥ తామగ్నివర్ణేతిమం
త్రేణదుర్గాగాయత్ర్యా సమభ్యర్చ్య, యోని పద్మమహాముద్రా
శ్చప్రదర్శయేత్ ॥ తతఃబ్రహ్మాణమభ్యర్చ్య, పీతఛాయాస్వితంగా
త్రంవిరించింవాగధీశ్వరం † శివధ్యానరతంవిభుం ॥ బ్రహ్మజజ్ఞాన
మితిమంత్రేణమూలేన చసంపూజ్య, బ్రహ్మగాయత్రీమేకవారంజ
ప్త్వా, జ్ఞానముద్రాంప్రదర్శ్య ॥ తతఃవాణీంసంపూజయేత్ ॥ చ
తుర్భుజాం † భారతీంవర్ణరూపిణీం ॥ ఇతిధ్యాత్వా, ప్రణోదే
వీతిమంత్రేణమూలేనచసంపూజ్య ॥ తతోనారాయణమభ్యర్చ్య॥
శ్యామవర్ణం†లోకరక్షాకరంపరమితిధ్యాత్వా, ఇదంవిష్ణుర్విష్ణుగా
యత్ర్యాచవిధివత్సంపూజ్య, శంఖచక్రముద్రేప్రదర్శయేత్ ॥ తతో
లక్ష్మీంసమభ్యర్చ్య లక్ష్మీం † వరదంచాభయంకరైః ॥ ఇతిధ్యా
త్వా, లక్ష్మీగాయత్ర్యాసక్తుమితిమంత్రేణచసంపూజ్య, శంఖప
ద్మమహాముద్రాఃప్రదర్శయేత్, పశ్చాద్దుర్గాంవిధివదభ్యర్చ్య ॥
చతుర్భుజాం † మహిషాసురమర్దినీం ॥ నవార్ణబీజైస్త్ర్యమిప్ర
యతోదేవీతిమంత్రేణవిధివద్యజేత్, యోనిముద్రాంప్రదర్శ్య, ॥
తతఃజ్యేష్ఠాదేవీంయజేత్ ॥ కరాళవదనాం † పురోభవాం ॥ మూ
లేనసంపూజ్య, మహాముద్రాంప్రదర్శ్య, తతోబ్రాహ్మ్యాదిశక్తీర్య
జేత్ ॥ చతుర్భుజాం † బ్రహ్మరూపిణీం ॥ ధ్యాత్వా, బ్రహ్మజజ్ఞా
నమితిమంత్రేణాభ్యర్చ్య ॥ చతుర్భుజాం † ధ్యాయేన్మాహేశ్వరీం
శివాం ॥ ఇతిధ్యాత్వా, మూలేనాభ్యర్చ్య, బాలాబీజైర్యోనిము
ద్రాంశూలముద్రాంచప్రదర్శ్య ॥ మస్తకాబద్ధమకుటాం † కౌ
మారీంసుంకుమప్రభాం, ఇతిధ్యాత్వా, కుమారంమాతేతిమంత్రే
ణమూలమంత్రేణచాభ్యర్చ్య ॥ తతః ॥ పద్మపత్రవిశాలాక్షీం † వై
ష్ణవీంవిష్ణురూపిణీం ॥ ఇతిధ్యాత్వా ॥ విష్ణోర్నుకమితిమంత్రేణాభ్య
ర్చ్యచక్రముద్రాంప్రదర్శ్య॥ వారాహవక్త్రాసదృశాం † కృష్ణాం

ఖరవిభూషితాం, ఇతిధ్యాత్వా, సవరాహేతిమంత్రేణసంపూజ్య
వరాహముద్రాందర్శయేత్ ॥ చతుర్భుజాం † ఇంద్రాణీమీప్సితా
ర్థదాం ॥ ఇంద్రాణీమాసునారిషదిత్యభ్యర్చ్య, వజ్రశక్తిముద్రాం
మూలేనప్రదర్శయేత్ ॥ తతః ॥ చతుర్భుజాం † చాముండాంచం
డవిక్రమాం ॥ ఏత్వాదేవీతిమంత్రేణవిధివద్యజేత్, శూలముద్రాం
ప్రదర్శ్య ॥ తతః ॥ యజేద్ధుతాశనం † సర్వాభీష్టప్రదాయకం ॥
ఇతిధ్యాత్వా, అగ్నిందూతమితిమంత్రేణాభ్యర్చ్య, మహాముద్రాం
ప్రదర్శ్య ॥ ధ్వజాగ్రే। ఆయంగౌఃపృశ్నిరక్రమీతిమంత్రేణమహావృ
షభమభ్యర్చ్య ॥ తతోగురుర్ధ్వజమభ్యర్చ్య ॥ యస్త్వేకాంఘ్రి +
దండరూపంధ్వజేశం ॥ ఇతిధ్యాత్వా, వృషగాయత్ర్యామూలేన
చగంధపుష్పాదిభిరభ్యర్చ్య ॥ తతః ॥ బలిపీఠమాసాద్య, ముఖపం
చసమనాస † మనసిబలిపీఠబలిభుక్ ॥ ఇతిధ్యాత్వా, యోభూతేతి
మంత్రేణసంపూజ్య ॥ తతఃదీపదండంసమభ్యర్చ్య ॥ ఏకాననం +
మహోజ్జ్వలం ॥ ఇతిధ్యాత్వా, మూలేనసంపూజ్య, మహాము
ద్రాంప్రదర్శ్య ॥ * తతోగురుగర్భగేహంప్రవిశ్య, దేవంసం
ప్రార్థ్య, ఓన్నమోదేవదేవేశ సర్వలోకైకనాయక, ఉత్తిష్ఠస్నా
నకర్మార్థమాత్మరక్షార్థమేవచ ॥ లింగేపూర్వేద్యురర్చితాం
పూజాంగాయత్ర్యాసంపూజ్య, మూలేనసామాన్యార్ఘ్యజలేనా
ర్ఘ్యందత్వా, అంగుష్ఠాదికనిష్ఠాంతమీశానాదిపంచకంవిన్యస్య
కనిష్ఠానామికామధ్యేపుష్పంసంగృహ్య, అంగుష్ఠతర్జనీభ్యాంలింగ
మస్తకాత్పూజాంహృన్మంత్రేణావరోప్య, పుష్పంలింగమూర్ధ్ని
విన్యస్య, నిర్మాల్యమైశాన్యాందిశిహృదాశుద్ధపాత్రేనిధాయ, అ
స్త్రేణలింగంపీఠంపాశుపతాస్త్రేణప్రక్షాళ్య, సామాన్యార్ఘ్యజ
లేనస్వాహాంతంహృన్మంత్రేణాభిషేచయేత్ ॥ తతశ్శివశక్తిభ్యాన్నమ
ఇతిలింగముద్రాంప్రదర్శయేదితిలింగశుద్ధిః॥ నైఋతేవాస్తోష్పతేతి

మంత్రేణ వాస్తుబ్రహ్మాణమభ్యర్చ్య, లింగపీఠస్యవాయవ్యాందిశివర దంగణేశంగాయత్ర్యామూలమంత్రేణచసంపూజ్య, పశ్చాల్లక్ష్మీం మూలేనాభ్యర్చ్య, ఐశాన్యాంగురుపఙ్క్తిః ప్రపూజయేత్ ॥ సదాశి వానంతశ్రీకంఠాంబికాసుఖండవిష్ణుధాత్రూన్ సప్తగురూన్యజేత్॥ కుందేందు + పరాయణంఇతిధ్యాత్వా॥ యోవేదాదౌస్వరఇత్యభ్య ర్చ్య, అష్టబాహుం † ధ్రువమీశ్వరం ॥ ఇతిధ్యాత్వా, ఈశాన స్సర్వవిద్యానామిత్యభ్యర్చ్య ॥ పంచవక్త్రం † విభూషితం, ఇ తిధ్యాత్వా, కద్రుద్రాయేతిమంత్రేణ సంపూజ్య, సర్వాభరణసం యుక్తాం † దేవీంవరదాభయభృతకరాం, ఇతిధ్యాత్వా, విశ్వా నినోదుర్గహేతిమంత్రేణాభ్యర్చ్య ॥ షడాననం † రక్తమాల్యా నులేపనం ॥ ఇతిధ్యాత్వా, గాయత్ర్యాసమ్యగభ్యర్చ్య ॥ శంఖచ క్రధరం + సంయుతం ॥ ఇతిధ్యాత్వా, విష్ణుంగాయత్ర్యాభ్యర్చ్య చక్రముద్రాంప్రదర్శ్య ॥ చతుర్ముఖం † శివధ్యానపరాయణం ॥ ఇతిధ్యాత్వా, బ్రహ్మాప్రతిష్ఠేతిమంత్రేణాభ్యర్చ్య ॥ తత్తన్మూలమం త్రేణతత్తన్నామ్నావా గురూనభ్యర్చ్య, ప్రాఙ్ముఖః, లబ్ధానుజ్ఞో దేవస్యాగ్నేయభాగే దక్షిణేవా రుచిరాసన సంయుతః పూరకా దిక్రమేణవిధివత్ప్రాణాయామత్రయం కృత్వాతతశ్శివపూజార్థం సంకల్ప్య ॥ తతః ॥ దేవస్యపీఠాధోభాగే, మధ్యతః, చతుర్భు జాంచతుర్వక్త్రాం క్షీరార్ణవతనుప్రభాం, సమస్తభూతసంసే వ్యాంక్రియామాధారరూపిణీం, ఓం హాం బ్రహ్మశిలోపరి॰ అనం తాసనాయనమ, తస్యోపరిసింహపీఠంప్రకల్ప్య, ఆగ్నేయాదీశానాం తకోణేషు,ధర్మాయనమః, జ్ఞానాయనమః, వైరాగ్యాయ నమః। ఐశ్వర్యాయనమః, పూర్వాది,అధర్మాయనమః,అజ్ఞానాయనమః అవైరాగ్యాయనమః,అనైశ్వర్యాయనమః,సింహపీఠస్యాగ్నేయాదిచ తురంఘ్రిషు, కృతయుగాయనమః, త్రేతాయుగాయనమ,ద్వాపర

యుగాయన, కలియుగాయనమః, ఊర్ధ్వమేఖలాయాం నైఋత్య
భాగే, ఓం హాం అధచ్ఛదనాయనమః, తమూర్ధ్వమైశాన్యాం,
ఓం హాం ఊర్ధ్వచ్ఛదనాయన, తన్మధ్యే ॥ కందాయనమః, బీ
జాయనమః, అంకురాయ, నాళాయన, పత్రేభ్యో, దళేభ్యో,
తన్మూల పీఠోపరి, కేసరేభ్యో, పీఠోన్నత భాగే, మధ్యే, కర్ణి
కాయై, పద్మాసనాయ, విమలాసనాయ, పూర్వాద్యష్టపత్రేషు
అనంతాయ, సూక్ష్మాయ, శివోత్తమాయ, ఏక నేత్రాయ, ఏక
రుద్రాయ, త్రిమూర్తయే, శ్రీకంఠాయ, శిఖండినేనన, పూర్వాది
ఇంద్రాయ, అగ్నయే, యమాయ, నిఋఋతయే,వరుణాయ,
వాయవె, కుబేరాయ, ఈశానాయ, కెసరేషు, వామాయై,జ్యే
ష్ఠాయై, శ్రేష్ఠాయై, రౌద్ర్యై, కాళ్యై, కలవికరణ్యై, బలి
వికరణ్యై, బలప్రమథిన్యై, సర్వభూతదమనాయై, పద్మస్య ద
ళాగ్రవృత్తే సూర్యమండలాయ, తస్యోపరి సోమమండలాయ,త
దూర్ధ్వే వహ్నిమండలాయ, మండలత్రయేషు, బ్రహ్మణే, విష్ణ
వే, రుద్రాయ, తత్రైవ,ఆత్మతత్త్వాయ,విద్యాతత్త్వాయ, శివత
త్త్వాయ,తత్ర,సత్త్వాయ,రజసె,తమసే,తస్యోపరి,దక్షిణాగ్నయే,
గార్హపత్యాగ్నయేఆహవనియ్యాగ్నయేపూర్వాదిదిక్షు,ఋగ్వేదా
య, యజుర్వేదాయ, సామవేదాయ, అధర్వణ వేదాయ, మ
ధ్యే ఓంకారపీఠాయ, తస్యోపరి మనోన్మన్యై, తదూర్ధ్వే ఓం
హాంహాం పరశివాయనమః ॥ యద్వా ॥ ఓం శ్రీమదోంకార పర
బ్రహ్మవిశ్వజగదాధారశక్త్యంకురప్రాంతశోభిత బీజాంకురమధ్యస్థి
తపంచాశత్కోటియోజనోచ్ఛ్రిత నానాగ్ర దేదీప్యమాన పంచాశ
త్కోటియోజన విస్తార మహాపద్మమధ్యరాజత్కర్ణికాంత స్థితా
య పరశివాసనాయనమః, శివాసనాది సర్వాధారభూతాది కూ
ర్మపృష్ఠభాగ పూర్వాదీశానాంత సూక్ష్మవ్యాధారభూతానాం

తవాసుకితక్షకకర్కోటకశంఖపాలగుళిక పద్మమహాపద్మాఖ్యమహా
నాగాష్టకకృతమణ్డలాంతఃకుణ్డలీకృతలాంగూల వేష్టితమహాపద్మనా
ళపూర్వాది స్వస్వాధారస్థితానంతసూక్ష్మశివోత్తమైకనేత్రైకరు
ద్రత్రిమూర్తిశ్రీకంఠశిఖండినామవిద్యేశ్వరాష్టకపరివృత మధ్యస్థితశే
షాఖ్యమహానాగతూలికాపూరితమధ్యేఅనంతాసనాయనమః। అనం
తాసనోర్ధ్వగతశేషశీర్షపూర్వాదిస్థితదీర్ఘస్వరాత్మకదేవతాధా
రభూతప్రాణాపాన వ్యానోదాన సమాన నాగకూర్మకృకరా
ఖ్యవాయ్వష్టక కల్పితచతురశ్ర మధ్యశోభిత ప్రణవాధచ్ఛదనోపరి
కీర్యమాణదేవదత్త ధనంజయనాగాఖ్య వాయుద్వయ పూర్వాది
స్థిత ప్రాణాదిస్వస్వాధారమధ్య స్ఫురద్దీర్ఘస్వరాత్మక దేవతా
పరివృత ప్రణవోర్ధ్వ ఛదనభాస్వతే యోగాసనాయనమః, యో
గాసనాధారస్థితస్వకీయ శ్వేతపీతరక్తహరిద్వర్ణ లసదాగ్నేయాది
కోణగతవాయవ్యాదికోణముఖత్రినేత్రసింహరూపసింహ కోటియుత
ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యనామపాదచతుష్టయమధ్యగతకృష్ణరక్తత
మాలమల్లికావర్ణలసత్పూర్వాదిస్థితావ్యక్తనియతికలాకాలనామచ
తుస్తత్త్వపూర్వాదిపాదశిరశ్చతుష్టయగతస్వస్వాసనమస్తకన్యస్తజ్ఞా
నవైరాగ్యచరణాగ్ర చతుష్టమైశ్వర్య మస్తకన్యస్తానైశ్వర్యాధర్మ
చరణాగ్రచతుష్టయ రాజాధిరాజముఖ స్తబ్ధగాత్ర త్రినేత్రస్వస్వప
రివారవృత శ్వేతరక్తపీతాసితవర్ణ లసదాగ్నేయాదికోణస్థితకృత
త్రేతాద్వాపరకలినామచతుఃకీలయంత్రితదేదీప్యమానదివ్యనవరత్న
విగ్రహరాజావర్తవర్ణలస ద్ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్య నామపూ
ర్వాదిఫలకకలితచతురశ్ర మధ్యస్థిత పాదాధర్మాదిముఖసింహ
సింహశీర్షచతుష్టయశోభమాన లక్ష్మీపతిమధ్యఫలకాయదివ్యరత్న
సింహాసనాయనమః ॥ సింహాసనోపరిస్థిత శ్వేతవర్ణశోభమానసద్యో
జాతమంత్రరూపశివధర్మమహాకందమధ్యసుందరవామదేవ మంత్ర

రూపశివజ్ఞాననాళమంజులా ఘోరమంత్ర రూపపృథివ్యప్తేజోవా యువ్వాకాశసత్వరజస్తమోరూప బహిర్దళాష్టకాంత దేదీప్యమానాణిమమహిమగరిమ లఘిమవశిత్వ ప్రాప్తిప్రాకామ్య నామామైశ్వర్య రూపాంతర్దళాష్ట కాంత స్తత్పురుష మంత్ర రూప చతుష్షష్టి కేసరాగ్రాలంకృతప్రాచ్యాదిదళమధ్యస్థితచంద్రార్ధశేఖరీకృతశిరో భాస్వత్కోటిరవిసమకాంతి కాంతవిగ్రహరాజత్పూర్ణచంద్రభాస్వదేకముఖత్రినేత్రరత్నాంబరభూషణగృహీతశివాసనదోధూయమాన శ్వేత చామరవరదాభయమనోహరచతుర్భుజ భాసమానవామా జ్యేష్ఠా కాద్రీకాళీకలవికరణీబలవికరణీ బలప్రమథనీసర్వభూతదమనీ నామకమహాశక్త్యష్టకపరివృత ఐశానమంత్ర రూపతప్తచామీకరవర్ణ పంచాశద్బీజయుక్త స్వమధ్యస్థితశుభ్రవర్ణ పాశాంకుశవరాభయ భాస్వచ్చతుర్భుజ శోభమానమనోన్మనీభాస్వద్వృత్త వైరాగ్య కర్ణికాత్మనేనమః, కర్ణికోపరి దేదీప్యమానప్రాచ్యాది హరిచ్చతుష్టయ స్ఫురదంబికాగణాంబికా గంగాగౌరీనామకచతుశ్శక్తిధృత ఋగ్యజుస్సామాథర్వణనామకచతుర్వేదఫలకమధ్యస్థిత వేదాంతమధ్యఫలకాంతస్స్ఫురదోంకారమయవ్యాఘ్రచర్మలసన్మనోన్మనీభాసురాయ విమలాసనాయనమః, ఓం హాం శివాసనాయనమః, ఇత్యాసనంసంపూజ్య,ఓంహాం హాం శివమూర్తయేనమః ॥ అథదండభంగిన్యాసః ॥ తతః ॥ మూర్తింతేజోరూపాందండాకారామవిభక్తావయవాం శివతత్వాత్మకపరబిందువ్యాప్తికాంవిభావ్య, లింగవేష్టనేనివేశయేత్, అస్యాందండాకారతేజోమయమూర్తౌ ఓం హూంఈశానమూర్ధ్నేనమః,ఓం హేంతత్పురుషవక్త్రాయన, ఓం హూం అఘోరహృదయాయ, ఓం హీం వామదేవగుహ్యాయ, ఓం హాం సద్యోజాతపాదాభ్యాంనమః,ఇతిదండభంగిన్యాసః, అథపూర్వవద్వ్యక్తిభంగికలాభంగిఅష్ట

త్రిగుణతత్త్వన్యాస శ్రీకంఠమాతృకాన్యాసాదీనికుర్యాత్। శాస్త్రేణానేనసకలో విజ్ఞేయోనిష్కళశ్శివః ॥ * ఋజూర్ధ్వకాయోమనశ్చక్షుర్నిరోధపూర్వకం ఇడయావాయుమాపూర్య, కుంభకంకృత్వా, హృదిపుష్పసంపూర్ణమం జలింనిధాయ, దృఢమావాహనముద్రాంబద్ధ్వా, స్వశరీరేమూలాధారస్థితంమంత్రమయంపరశివజ్యోతిస్తత్సమాకృష్య, మూలాధారప్రకృతిస్థితం హకారమతిలంఘ్యహృదయపర్యంతంనీత్వా, హృత్కంఠతాల్వాదిస్థానస్థితపృథివ్యాదిపాశజాలబ్రహ్మాదికారణేశ్వరసహితాకారాదిద్వాదశకలాశ్చక్రమేణతత్తదనుసంధానపూర్వకమతిలంఘ్య, ద్వాదశాంతపర్యంతముచ్చారయన్నేవ, పుష్పాంజలిమపి ద్వాదశాంతపర్యంతంనీత్వా, మంత్రమయం జ్యోతిర్ద్వాదశాంతస్థ పరశివేనసంయోజ్య, విశ్రాంతంపరమామృతస్వం దిబిందురూపంతతఆనీయ,భ్రూమధ్యగతశివమంటపవిశ్రాంతం సంభావ్య,శరదిందుసహస్రవదాభావ్య, హృద్దేశేంజలింవిధారయన్, వాయుంపింగళయావిరేచ్య వాయునాసహపరమశివజ్యోతిఃపుష్పాంజలిమధ్యప్రాప్తం విభావ్య ఓం హాం హాం శివాయనమః, ఇతిసదాశివస్యబ్రహ్మరంధ్రేయోజయేత్ ॥ యద్వా ॥ పుష్పైరంజలిమాపూర్య, మూలమంత్రంమేధాదికలోపేతం ప్రచండమార్తాండోపమం బ్రహ్మాదికారణేశ్వరత్యాగక్రమేణలయాంతముచ్చరన్ సర్వకారణంనిష్కళం విభుం జ్ఞానానందమయం స్వప్రకాశంసంచింత్య, తన్మయీభూతంస్సృష్టిక్రమేణద్వాదశాంతాత్పతంగబింబాభం లలాటే అవతార్య, చంద్రకోటిసదృశం నిర్యత్సుధాపిండపాండురితం దిఙ్మండలంధ్యాత్వా పాత్రప్రవాహవత్సుషుమ్నా నాపినిగత్యాంజలిగతంవిచింత్య, లక్ష్యమూర్తౌ ఆవాహనముద్రయా హృదయ మంత్రేణావాహ్య,

స్థాపనముద్రయాత్రస్మిన్సంస్థాప్య, సన్నిధానముద్రయా స్వాభిము
ఖీకృత్య, స్వాగతంతేమహాదేవేతివిజ్ఞాప్య, వత్స సుస్వాగత మితి
దేవోత్తరం మనసావిభావ్య, స్వాగతార్ఘ్యం దత్వా, సన్నిరో
ధనముద్రయా సన్నిరుధ్య, హృద్యంజలి బంధ పూర్వకం సంప్రా
ర్థ్య, శివస్యానుమతిం భావయిత్వా, నిరోధార్ఘ్యం దత్వా,
హుంఫడంతాస్త్రేణ విఘ్నా నుత్సార్య, కవచేనావకుంఠ్య, హృ
చ్ఛిరశ్శిఖాకవచాసిమంత్రైర్దేవస్యహృదయాదిస్థానేషువిన్యస్య, పు
ష్పమారోప్య, మూలేనపరమీకృత్య, ధేనుముద్రయా అమృతీకుర్యా
త్ ॥ తతః ॥ కోటిసూర్య సమప్రభం కోటిశీతాంశు శీతలాష్ట
త్రింశత్కలాత్మక కేసరోజ్వల ప్రణవ కర్ణికా పంచాక్షరబీజా
ఢ్య పరమానంద మధుభరిత మత్తభృంగ నిషేవిత చిచ్ఛక్తి రూప
సహస్రదళకమల మధ్యగతం- సద్యస్సముద్యదనేకకోటి శారదశ
శాంక సంకాశ ప్రకాశం పరమానందజలనిధిం నిష్కళంక పరమ
శివంసకలరూపాన్వితంధ్యాత్వా ॥ * ॥ శుద్ధస్ఫటికసంకాశంద్వా
త్రింశల్లక్షణాన్వితమ్ । పద్మాసనస్థం పంచాస్యం ప్రతి వక్త్రం
త్రిలోచనమ్। దృక్త్రియేచ్ఛావిశాలాక్షం జ్ఞానచంద్రకళాన్వితమ్॥
ధవళేశానవదనం పీతం తత్పురుషాననమ్ । కృష్ణాఘోర ముఖో
పేతం రక్తాథోత్తరవక్త్రకమ్ । సుశ్వేతం పశ్చిమైకాస్యం స
ద్యోజాతంసుమూర్తికమ్ ॥ నాగోపవీతినం శాంతం జటా ఖం
డేందుమండితమ్ । శక్తి శూలాసి ఖట్వాంగ వరవ్యాఘ్ర కరాం
బుజమ్ ॥ దక్షిణే త్వథవామస్థే డమరుం బీజపూరకమ్ । నా
గాక్షసూత్రనీలాబ్జం బిభ్రాణంపంచభిః కరైః । భావయేత్పరమీ
శానం జగత్కారణమవ్యయమ్ ॥ ఇతిధ్యాత్వా॥ ఓంహంహాం
విద్యాదేహాయ శివాయనమః, ఈశానస్సర్వవిద్యానామితిజప్త్వా-
తతః హృన్మంత్రేణ మూలేన వ్యాహృతిభిశ్చపాదయోఃపాద్యం ॥

స్వధాంతేన ప్రణవేన రుద్రగాయత్ర్యా చ ఈశానాదిముఖ పంచకే

ష్వాచమనం ॥ స్వాహాంతేన శివగాయత్ర్యా తథైవ శిరసి పంచకే

ష్వర్ఘ్యం । వౌషడంతేనహృన్మంత్రేణ దూర్వాక్షతాన్దద్యాత్ ॥

హృదాస్వాహాంతేన మూలేనకద్రుద్రాయచధూపదీపౌ । మహా

ఘంటాం సంతాడ్య, పూర్వవదాచమనార్ఘ్యం దత్వా ॥ స్నానా

ర్థంవిజ్ఞాప్య ॥ త్రియంబకేతిమంత్రేణ వామదేవ్యేనేతిచ శుద్ధతైలే

నాభ్యజ్య ॥ ఘృతస్నాతైన ఘృతేనాభిషిచ్య ॥ శాలిపిష్టేన ము

ద్గామలక బిల్వరజనీచూర్ణైశ్చ శన్నోదేవీతిమంత్రేణపాదమం

త్రైరుద్వర్త్య । పవిత్రంతేతిమంత్రేణ పంచగవ్యేనసంస్నాప్య॥

పూర్వోక్తమంత్రైః పంచామృతద్రవ్యైర్యాజాతేత్యనువాకేనబ్ర

హ్మాంగమంత్రైశ్చ పనసనారికేళమాతుళుంగద్వయనారంగలికుచర

సాలఫలరసైః సద్యోజాతేతిమంత్రేణద్రాక్షాఫలాంబునావామదే

వేతిమంత్రేణ ఖర్జూరతోయేనాఘోరమంత్రేణామ్రఫల

రసేన తత్పురుషేతి మృగమదాంభసా ఈశానేతి జంబూఫలరసే

నసితాసితేతి కుశాంభసాపోహిష్ఠేతి శుద్ధోదకేనగన్ధద్వారేతి గన్ధ

జలేన గౌరీమిమాయేతి హరిద్రోదకేన పుష్పావతీతిసుమతోయేన

సహస్రాణీతి రత్నోదకేన యాతేరుద్రేతి హిమవారిణా కద్రుద్రా

యాన్నపతేతి ద్వాభ్యాం శాల్యోదనేన గాయత్ర్యా క్షీరధారాస్నాత

వారిణా ॥ హిరణ్యరూపేతి స్వర్ణోదకేనపంచాక్షరీమంత్రేణ

కపిత్థఫలోదకేన హృదయాద్యంగమంత్రైరేనతోకామేతి బృహతీ

వారయవగోధూమచణకాద్యన్నోదకైః కాండాత్కాండేతి

మంత్రేణ కుశదూర్వోదకాభ్యామఘోరాస్త్రేణ దాడిమీఫల రసే

న బృహత్సామేతి భసితాంభసా ॥ పాశుపతేన కర్పూరాగరు

తోయాభ్యామశ్వక్రాంతేతి మృజ్జలేన స్వాద్వీంత్వేతి మంత్రేణేక్షుర

సేనస్నాపయేత్ ॥ తతోగురుహిరణ్యవర్ణాశ్శుచయఇతి పావ

శాఇతి చతస్సృభిర్నమస్సోమాయేతి మన్త్రైశ్చ శుద్ధతోయేనాభి షేచయేత్, తతస్సద్యోజాతాది మంత్రైర్హృదయాద్యంగ మన్త్రైర్వ్యోమవ్యాపినీ మన్త్రైస్స్నపన జలేన స్నాపయేత్ ॥ ధారా కర కేన వాశంఖేన వర్ధన్యా వారుద్ర సూక్త మన్యుసూక్త పవమానసూక్తాంభస్యేత్యనువాకాథర్వణశీర్ష శనో వాతఃపవతా మిత్యాదిశాంతిక పౌష్టికమన్త్రైః పరయాభక్త్యా ప్రత్యహమభిషేచయేత్ ప్రతిద్రవ్యావసానేధూపదీపాదికందత్వా తతఃపాద్యాచమనార్ఘ్యాణిదద్యాత్ ॥ తతస్సూక్ష్మ వాససాభి మృజ్య । మూలేన సుగన్ధేనానులిప్యయువంవస్త్రాణీతి బుచాసు శ్లక్ష్ణాభ్యాం దుకూలాభ్యామలంకృత్య ॥ బ్రహ్మాంగమన్త్రై రక్త పుష్పైరభ్యర్చ్య అస్త్రేణసనాథంమూలేనాభిమంత్రిత మంత్ర హావిర్నివేద్య, ఆచమనందత్వా ॥ తతః ॥ యజ్ఞోపవీతమంత్రేణ యజ్ఞసూత్రం ధారయిత్వా, హిరణ్యరూపమితిమంత్రేణ హేమమ కుటకణ్ఠికాహారకేయూరాదిభిరాభరణైరలంకృత్య, గంధద్వా రామితి కుంకుమచందనైలాకర్పూర కృష్ణాగరుదారుకుష్ఠ కస్తూరి కాద్రవ్యైర్మిశ్రిత గంధేనానులిప్య, ఇరావతీత్యాయనేతిచద్వా భ్యాం మన్త్రాభ్యా మక్షతాన్నిక్షిప్య, పుష్పావతీతిమంత్రేణపుష్ప మాలాభిరలంకృత్య, నమస్సోమాయేతిమంత్రేణాష్ట పుష్పైరభ్య ర్చ్యఓం హాంహాం ఆత్మతత్వాధిపతయేరుద్రాయనమఓం హాం హాం విద్యాతత్వాధిపతయేశివాయనమః ఓం హాం హాం శివ తత్వాధిపతయేపరమశివాయనమః ఇతిత్రిద్వత్త్వైశ్చ ప్రపూజయేత్, తతఃపంచబ్రహ్మాణామభిర్హృదయాద్యంగానామభిర్భవాద్యష్టనామ భిరష్టోత్తరశతనామభి స్సహస్రనామభిర్వార్చయేత్ ॥ అస్త్ర మంత్రేణఘంటాంప్రతాడ్య, ధూపదీపౌదత్వా- తతశ్చాచమనా ర్ఘ్యందద్యాత్ ॥ మనోరథముద్రాంప్రదర్శ్య-తతోబ్రహ్మాంగాని

లయాంతస్థానేషు సంపూజయేత్ ॥ కామ్యాని విజ్ఞాప్య ॥ తత
ఆవరణపూజార్థం లబ్ధానుజ్ఞ శ్శివం మూలమంత్రేణాభ్యర్చ్య ॥ అ
థావరణపూజాం కుర్యాత్ ॥ * ॥ పంచ బ్రహ్మ షడంగ విద్యే
శ్వరగణాధిప లోకేశాయుధ దేవతా శ్శైవతాః పంచావరణేషు
పూజయేత్ ॥ శివాసనపద్మస్య కర్ణికాయాం శివమభ్యర్చ్య। త
స్యదళమూలేషు మధ్యేషు దళమూలాగ్రయోర్మధ్యేషు దళాగ్రేషు
తదధోభాగేషుచ పూజయేత్ ॥ యద్వా ॥ శివాసన పద్మదళ
మూలరూపేషు లింగమూలభాగేషు తద్దళాగ్ర రూపేషుపీఠోపరి
దళాగ్రభాగేషు పీఠకంఠే పీఠపాదే బ్రహ్మశిలాస్థానీయే పద్మ పీ
ఠేవార్చయేత్ ॥ * ॥ ఊర్ధ్వే, ఓం హ్రాం ఈశాన మూ
ర్ధ్నే నమః ॥ స్ఫటికవర్ణం స్ఫటికాక్ష మాలాభయ పాణిను
మాసహిత మీశానం పూజయామి ॥ పూర్వే ॥ ఓం హ్రీం త
త్పురుషవక్త్రాయ నమః ॥ కనక వర్ణం పీతాంబరోపవీతం మా
తులుంగాక్ష సూత్రధారిణం గౌరీసహితం తత్పురుషం పూజ
యామి ॥ దక్షిణదళే ॥ ఓం హ్రూం అఘోర హృదయాయన
మః, మేఘవర్ణం బభ్రుశ్మశ్రుశిరోరుహం దంష్ట్రాకరాళవదనం స
ర్పవృశ్చిక కపాల మాలాభరణం ఖట్వాంగ కపాలఖేటక పా
శాన్వితవామకరచతుష్టయం త్రిశూల పరశు ఖడ్గదండాన్వితదక్షి
ణకర చతుష్టయం గంగాసహిత మఘోరం పూజయామి ॥ ఉ
త్తరదళే ॥ ఓం హ్రైం వామదేవ గుహ్యాయనమః, అరుణమరు
ణమాల్యవస్త్రోపవీతం ఖడ్గ ఖేటధరం గణాంబికా సహితం వా
మదేవం పూజయామి ॥ పశ్చిమదళే ॥ ఓం హ్రౌం సద్యోజాతపా
దాభ్యాన్నమః॥ ధవళవర్ణం ధవళ గంధవస్త్రోష్ణీష భూషణకుసు
మాన్వితం వరాభయ కరమంబికాసహితం సద్యోజాతం పూజ
యామి ॥ తత్తత్పూజావేళాయామూర్ధ్వవక్త్ర హృదయగుహ్య

పాదరూపం తత్తత్థ్సానాదంకుశముద్రయాకృష్య ॥ దీపంతత్ప్రవ
తేక రీత్యా భిన్నాన్భావయిత్వార్చయేత్ ॥ ఈశానాద్యాగ
పంచాపిశూలటంక వరాభయ మనోహర కర చతుష్టయావా ధ్యే
యాః ॥ ఓం హాం హృదయాయనమః ॥ ఓం హీం శిరసేన
మః ॥ ఓం హూం శిఖాయైనమః, ఓం హైంకవచాయనమః॥
ఓం హౌం నేత్రత్రయాయనమః ॥ ఓం హః అస్త్రాయనమః
ఇతిచంద్రచామీకరసిందూరభృంగవిద్యుదగ్నివర్ణాన్పద్మాసనస్థాన
ర్ధేందు మకుట ధారిణశ్చతుర్వక్త్రాన్ప్రతివక్త్రం త్రిలోచనా
న్కపాల శూల వరాభయహస్తాన్వామినీనీవినీచక్రిణీ శంకినీఖడ్గినీశ
క్తిసహితాన్హృదయ శిరశ్శిఖాకవచ నేత్రాధిదేవాన్పూజయామీ
తి హృదయాదిస్థానేభ్యోంకుశముద్రయా సమాకృష్యాగ్నేయేశా
న వాయవ్య నైఋత్యకోణస్థదళేషు పూర్వాదిదళాగ్రే ష్వస్త్రం
పూజయేదితి ప్రథమావరణం ॥ ❊ ॥ అనంతాయ భూమిసహితా
యనమః ॥ సూక్ష్మాయస్వాహాసహితాయనమః ॥ శివోత్తమా
యస్వధాసహితాయ ॥ ఏకనేత్రాయ శిక్షాసహితాయనమః॥
ఏకరుద్రాయ పుష్టిసహితాయ ॥ త్రిమూర్తయేశ్రీసహితాయ॥
శ్రీకంఠాయ కీర్తిసహితాయ ॥ శిఖండినేమేధాసహితాయనమః
ఇతి హేమాగ్నిమేఘశంఖహిమవిద్రుమస్ఫటికవర్ణాన్వరదాభయ
జ్ఞానముద్రాక్షమాలికాధారిణః త్రినేత్రాన్శివజ్ఞానావదాతాన్స్వ
శక్తిసహితాన్విద్యేశ్వరాన్పూజయామీతి పూర్వాద్యష్టదిక్షుపూ
జయేదితి ద్వితీయావరణమ్ ॥ ❊ ॥ కుండలీసహితాయ నందికే
శ్వరాయనమః ॥ అరుణవర్ణత్రిశూలాక్షసూత్రాభయకరంకుం
డలీసహితం నందినం పూజయామి ॥ పద్మినీసహితాయమహాకా
ళాయనమః ॥ పీతకృష్ణవర్ణంబభ్రుశ్మశ్రుశిరోరుహం శూలకపా
లఖడ్గఖేటధారిణం పద్మినీసహితం మహాకాళం పూజయామి ॥

స్తోభినీసహితాయ భృంగిణేనమః॥ శ్వేతవర్ణం నిర్మలస్రగ్రహం. దండాక్షసూత్రధరం విలసచ్ఛిఖం శివాలోకనతత్పరం స్తోభినీ సహితం భృంగిణం పూజయామి ॥*॥ భృంగిణీసహితాయ గణపతయేనమః॥ రక్తాంగం పాశాంకుశస్వదంత పక్వామ్రఫలధారిణం భృంగిణీసహితం గణపతిం పూజయామి ॥ భద్రాసహితాయ వృషభాయ నమః ॥ స్ఫటికవర్ణం బ్రహ్మస్వరూపం భద్రాసహితం వృషభం పూజయామి ॥ దేవసేనాసహితాయ స్కందాయనమః॥ కనకవర్ణం బాలవేషం శక్తివరాభయహస్తం దేవసేనాసహితం స్కందం పూజయామి ॥ అంబికాయై ॥ శ్యామవర్ణం సింహవాహనాం శూలాదర్శ కరద్వయా ముమాం పూజయామి ॥ రూపిణీసహితాయ చండేశ్వరాయనమః ॥ మేఘవక్త్రం చతుర్వక్త్రంక మండల్వక్షసూత్ర శూల పరశుధారిణం సర్ప కంకణోపవీతం రూపిణీసహితం చండేశ్వరం పూజయామీతి పూర్వాది ఈశానకోణ పర్యంతమర్చయేత్ ॥ యద్వా॥ వృషనందిగణేశమహాకాళస్కందభృంగిగౌరీచండాంతం ॥ నందిగణపతి మహాకాళ భృంగి వృషస్కంద గౌరీచండాన్వా ॥ ఉమానందచండమహాకాళ వృష గణేశభృంగిస్కందాన్వా పూర్వాదిక్రమేణ పూజయేదితి తృతీయావరణం ॥ ఇంద్రాయ శచీసహితాయ ॥ స్వర్ణవర్ణమైరావతారూఢం వజ్రాంకుశవరాభయపాణిం శచీసహితమింద్రం పూజయామి ॥ స్వాహాసహితాయ అగ్నయేనమః ॥ రక్తవర్ణంక మండల్వక్షసూత్రశక్తిధరం ముచ్రాన్వితం మేషారూఢం స్వాహా సహితమగ్నింపూజయామి ॥ కాలకంఠీసహితాయయమాయనమః కృష్ణవర్ణందండపాశవరాభయధారిణం మహిషారూఢంకాలకంఠీసహితంయమంపూజయామి॥డాకినీసహితాయనైఋతాయనమః రక్తవర్ణంఖడ్గఖేటవరాభయధారిణం భూతారూఢం డాకినీసహి

తంనిఋఋతింపూజయామి॥భోగినీసహితాయవరుణాయనమః॥చం
ద్రవర్ణం పాశకమలవరాభయకరంమకరారూఢం భోగినీ సహి
తం వరుణంపూజయామి ॥ ఘోరాసహితాయ వాయవే నమః॥
ధూమ్రవర్ణం ధ్వజకమలవరాభయధారిణం మృగారూఢం ఘో
రాసహితం వాయుంపూజయామి ॥ గుంభినీసహితాయ కుబేరా
యనమః ॥ పింగళవర్ణం గదాది ధారిణం అశ్వారూఢంగుంభినీ
సహితం కుబేరం పూజయామి ॥ హర్షిణీసహితాయ ఈశా
నాయనమః ॥ చంద్రవర్ణం శూలపాశవరాభయకరంత్రినేత్రం
వృషభారూఢం హర్షిణీసహిత మీశానం పూజయామి ॥ ఇతి
ప్రాగాదిక్రమేణ పూజయేత్ ॥ సావిత్రీ సహితాయ బ్రహ్మణేన
మః ॥ స్వర్ణ వర్ణం చతుర్వక్త్రం కమండల్వక్షస్రగ్దండ ధారి
ణం హంసారూఢం సావిత్రీసహితం బ్రహ్మాణంపూజయామి లక్ష్మీ
సహితాయ విష్ణవేనమః ॥ విద్యుద్వర్ణం సహస్రఫణాలంకృతమ
నంతరూపం శంఖచక్ర గదాకమలధారిణం కూర్మారూఢం ల
క్ష్మీసహితం విష్ణుం పూజయామి ॥ ఇతీంద్రేశాన మధ్యే నిఋ
ఋతి వరుణమధ్యేచ విధాతృవైకుంఠౌ పూజయేత్ ॥ యద్వా॥
మధ్యోత్తరభాగే కుబేరస్య దక్షిణ భాగేచ పూజయేదితి తురీయా
వరణం॥* ప్రాణశక్తిసహితాయవజ్రాయనమఃవజ్రంపూజయామి॥
శక్తయేనమః అరుణవర్ణం వరాభయకరాం శిరసాశక్తిం బి
భ్రాణాం యోషిదాకారాం శక్తిం పూజయామి ॥ కోపాత్మశ
క్తిసహితాయ దండాయనమః ॥ కృష్ణ వర్ణం వరాభయకరం
లోహితలోచనం దండమూర్ధానం కోపాత్మశక్తిసహితందండం
పూజయామి ॥ గుణశక్తిసహితాయ ఖడ్గాయనమః ॥ శ్యామవ
ర్ణం వరాభయకరం కుండలోచనం ఖడ్గాలంకృత మూర్ధా
నం గుణాత్మక శక్తిసహితం ఖడ్గంపూజయామి ॥ కోమలాత్మక
శక్తి సహితం ఖడ్గంపూజయామి ॥కోమలాత్మక శక్తిసహితాయ

పాశాయనమః ॥ కింశుక పుష్పవర్ణం నాభే రథో భుజంగా కారం తదూర్ధ్వేం పురుషాకృతిం సప్త ఫణోపేత మూర్ధానం కోమలాత్మశక్తిసహితం పాశంపూజయామి ॥ విషాత్మక శక్తిస హితాయ ధ్వజాయనమః ॥ పీతవర్ణం వరాభయ కరం వివృ త్తాస్యం మూర్ధ్ని ధ్వజాన్వితం విషాత్మశక్తి సహితం ధ్వజంపూ జయామి ॥ గదాయైనమః పీతవర్ణాయైనమః ॥ యోషిదాకా రాం దీప్తశిరసంగదాం పూజయామి ॥ వికృతాత్మశక్తిసహితా య శూలాయ నమః ॥ శ్యామవర్ణంత్రిశూలాంకితమస్తకం అంజ లియుక్తం కృతాత్మశక్తిసహితం త్రిశూలం పూజయామి॥ మహా శక్తిసహితాయ పద్మాయనమః ॥ శంఖవర్ణం పద్మకోశా మూ ర్ధానంమహాశక్తిసహితంపద్మం పూజయామి॥ మాహాత్మ్యశక్తిస హితాయచక్రాయ నమః॥శ్యామవర్ణంశతారచక్రాంకితమస్తకం మంగళాత్మసహితంచక్రంపూజయామీతిపంచమావరణం॥ శివాభి ముఖాః శివమంబికాంచభక్త్యా వీక్షమాణాఃస్వాసనేషూపవిష్టాః ధ్యేయాఃద్విభుజాశ్చతుర్భుజాస్తేబద్ధహస్తాంజలిపుటావా ధ్యేయాః- పంచావరణపూజాయామశక్తః పంచబ్రహ్మ షడంగదేవతాయుక్త మేకావరణమర్చయేత్ ॥ పంచావరణేషు- బ్రహ్మషడంగానా మా వాహన స్థాపనసన్నిధాన సన్నిరోధనపాద్యాచమనార్ఘ్య పుష్ప దానాఖ్యసంస్కారాష్టకంకార్యం- యద్వాసంస్కారాష్టకంస ముదితమేవ- స్మృత్వాప్రత్యేకమర్ఘ్యమాత్రందత్వా, బ్రహ్మణా మర్ఘ్యావసానేక్రమేణసురభిపద్మత్రిశూల మకరసృగాఖ్యముద్రాః ప్రదర్శ్యాంగానాంనమస్కారముద్రాంప్రదర్శయేత్ ॥ పరశివస్య వామభాగేస్థితాంలోహమయీంగౌరీమర్చయేత్ ॥ పూర్ణచంద్రా భవదనాంనీల * కుంతలమూర్ధజాం- ప్రఫుల్లోత్పలపత్రాభవిస్తీ

---

* కుంచిత సాంద్రాంగతగం

ణాఽఽయతలోచనాం- నీలోత్పలదళప్రఖ్యాం చంద్రార్ధకృతశేఖరాం- అతివృత్తఘనోత్తుంగస్నిగ్ధపీనపయోధరాం- తనుమధ్యాం పృథుశ్రోణింపీతసూక్ష్మతరాంబరాం- సర్వాభరణసంపన్నాంలలాటతిలకోజ్జ్వలాం, విచిత్రపుష్పసంకీర్ణ కేశపాశోపశోభితాం, సర్వతోఽనుగుణాకారాం కించిల్లజ్జానతాననాం - హేమారవిందం వికచందధానాందక్షిణేకరే॥దండవచ్చాపరం హస్తం న్యస్యాసీనాం సహాసనే- ఇతిధ్యాత్వా- గౌరీగాయత్ర్యా విధివదభ్యర్చ్య॥ యోనిముద్రాం ప్రదర్శయేత్॥

తతఃపృథక్ష్నానస్థితాంవీరనాయకాంమనోన్మనీంసంపూజ్య॥ దేవ్యాలయద్వారోర్ధ్వదక్షిణే, ఓం గంగణపతయే- ఉత్తరే, సరస్వత్యై- తయోర్మధ్యే- మహాలక్ష్మ్యై- దక్షిణశాఖాయాంకమలిన్యై- వామశాఖాయాం- మాలిన్యై- అగ్నిపశ్చాస్యాయా- గన్ధపుష్పాదిభిరభ్యర్చ్య- త్రివిధవిఘ్నానుత్సార్య- పాశుపతాస్త్రేణదేహళీమభ్యర్చ్య, నైఋత్యాం- వాస్తుబ్రహ్మాణమభ్యర్చ్య- అన్తఃప్రవిశ్య- కృష్ణాజినేచోపవిశ్య- పూజాద్రవ్యాణ్యుపహృత్య- కరన్యాసంకుర్యాత్- ఓం హ్రః అస్త్రాయఫడితిదక్షిణవామహస్తౌ ఊర్ధ్వాధఃక్రమేణసంశోధ్య- ఓం హ్రాం శక్తయేవౌషడిత్యాప్లావ్య- హస్తతలయోరంగుష్ఠాభ్యాం- హ్రీం గౌర్యాసనాయ- ఓం హ్రీం ఓం గౌరీమూర్త్యై- ఇతివిన్యస్య- హస్తతలయోర్మధ్యమాఙ్గులీభ్యాం- ఓం హ్రీం గ్లౌం గౌరీనేత్రాభ్యాం- కనిష్ఠాదికరశాఖాసు- ఓం హ్రామిత్యాదిహృదయాదిషడఙ్గానివిన్యస్య- కవచేనావకుణ్ఠ్య- ఉభౌసంయోజ్య .ఓం హ్రీం హాం గౌర్యైనమ ఇతి * పరమీకృత్య- ఓం హ్రీం గౌర్యాసనాయ- హృదయే- ఓం హాం హ్రీం హ్రూం గౌరీమూర్త్యై- హాం మిత్యాదిషడఙ్గ

* వౌషడితి పాఠాంతరం

శ్రీజైహృదయాదిన్యాసంకుర్యాత్- కవచేనావకుంఠ్య- మహాము ద్రాం ప్రదర్శయేత్- భూతశుద్ధ్యాదిపీఠార్చనాన్తం పూర్వవత్కృత్వా- పీఠార్చనే- క్షిత్యాదిపద్మపర్యన్తమాసనంపరికల్ప్య- తతో ధ్యాయేత్- ఏకవక్త్రాం త్రినయనాం † చక్రస్యనాయికాం ॥ య ద్వా ॥ సిందూరాభాం త్రినేత్రాం † నమామి ॥ ఇతిధ్యాత్వా ॥ త్ర్యశ్రైర్వృత్తైఃపఞ్చదశైర్వర్ణైః షోడశాక్షైర్మూలమన్త్రేణ గాయత్ర్యా గౌరీ మిమాయేతిమన్త్రేణావాహ్య- దుర్గామన్త్రైః శ్రీసూక్తేనరాత్రిసూక్తేన వాశుద్ధోదకేనాభిషేచయేత్, శేషం పూర్వవత్కృత్వా- గౌరీకలాన్యాసంకుర్యాత్- గౌరీకలాన్యాసమా వాహనాత్పూర్వమేవవాకర్తవ్యం- ఓం హ్రీం తారాకలాయై నమః- మూర్ధ్ని- ఇతీశానకలా- హ్రీం విద్యాకలాయై-వక్త్రే- ఇతితత్పురుషకలా- () మృత్యు కలాయై- హృదయే- శ్రద్ధాకలాయై- కణ్ఠే- రంభాకలాయై- దక్షిణబాహౌ- మేధాక లాయైవామబాహౌ- స్వాహాకలాయై- జఠరే- * స్వధా కలా యై ॥ నాభౌ ॥ ఇత్యఘోరకలా ॥ పాలినీకలాయైయోనౌజ్వాలినీ కలాయై- గుహ్యే- తృష్ణాకలాయై- దక్షిణోరౌ- స్మృతి కలా యై-వామోరౌ-కామకలాయై,దక్షిణజానునిమతికలాయై-వామజా నుని-రజఃకలాయై- దక్షిణజంఘాయాం-చింతాకలాయైవామజంఘా యాంభూతికలాయై-పృష్ఠే-క్రియాకలాయై_దక్షిణపార్శ్వే-శాన్తి కలాయై- వామపార్శ్వే- ఇతివామదేవకలా॥ శాన్తికలాయై- ద క్షిణపాదే- దాన్తికలాయై- వామపాదే- దయాకలాయై- దక్షి ణహస్తే- శ్రుతికలాయై- వామహస్తే- ద్యుతికలాయై- దక్షిణస్త నే- సంధ్యాకలాయై- వామస్తనే- జ్ఞానకలాయై- సర్వాంగే ఇతిసద్యోజాతకలా- ఓం హ్రీ మితిసర్వత్రయోజయేత్- ఇతిష

()ముఖే- * స్వస్తికలాయై- పా॥

